శ్రీః

# వరాహోపనిషత్తు

(కృష్ణయజుర్వేదశాఖ)

(ఋభు వరాహ, ఋభు నిదాఘ సంవాదరూపము)

"రసా" వ్యాఖ్యా సమేతం

(ఆంధ్ర ప్రతిపదార్థ తాత్పర్యములు)

మేళ్లచెర్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

**శ్రీ లలితానందాశ్రమము**

వాడరేవు



శ్రీః

**వరాహోపనిషత్తు**

రసావ్యాఖ్యాసహితం

మేళ్ళచెర్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి
విశ్రాంత సంస్కృత అధ్యాపకుడు, తెనాలి
ఫోన్ : 9908163627, 9248375848

ప్రథమ ముద్రణ : **09.09.2013**
ప్రతులు : **500**
పేజీలు : **124**
వెల రూ. : **60/-**



D.T.P.:
**MR LASER PRINTS**
Chirala
Cell: **9849976054**



Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.



డా॥ యన్. సూర్యనారాయణ, కోటేశ్వరమ్మగార్ల
ఆర్థికసహాయంతో ముద్రింపబడిన ఈ గ్రంథము
వారి గురుపరంపరలోని మహనీయుల పాదపద్మములకు
నమస్సులతో సమర్పితము.
ఈ గ్రంథము 'శ్రీలలితానందాశ్రమము, వాడరేవు' తరపున
వెలువరించుటకు అంగీకరించిన 'శ్రీశ్రీశ్రీ అరుళానంద స్వామి' వారికి
నమస్కరిస్తూ.....

– రామోరా







శ్రీః

# వరాహోపనిషత్

## ('రసా' వ్యాఖ్యాసమేతం)

**శ్రీమద్వరాహోపనిషద్వేద్యాఖండసుఖాకృతి**
**త్రిపాన్నారాయణాఖ్యం తద్రామచంద్రపదం భజే॥** **1**

**ప్రతిపదార్థం :–** శ్రీమత్ = శ్రీమంతమయిన, వరాహోపనిషత్ = వరాహోపనిషత్తుచేత, వేద్య = తెలిసికొనదగినదియు, అఖండ = అఖండమయిన, సుఖాకృతి = ఆనందమే స్వరూపముగాగలదియు, త్రిపాత్ = మూడుపాదములుగల, నారాయణాఖ్యమ్ = నారాయణుడను పేరు గల, తత్ = ఆ, రామచంద్ర = రామచంద్రునియొక్క, పదమ్ = పాదమును, తారకరామ నామమును, భజే = సేవించెదను.

**తాత్పర్యం :–** వరాహోపనిషత్తు నందు ప్రతిపాదించబడిన అఖండ సచ్చిదానందాకారమయిన త్రిపాన్నారాయణ విభూతి అయిన శ్రీరామచంద్ర పదమును సేవించెదను. ఇది కృష్ణ యజుర్వేద సంబంధమయిన **ఉపనిషత్తు.**





**విశేషణము :–** 1. బ్రహ్మకు 4 పాదములను కల్పించారు. అందు ఒక పాదము సమస్త విశ్వము. మిగిలిన మూడు పాదములు ఊర్ధ్వమునందున్నవి. అవి అమృతము.

2. త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్తు ప్రకారము – నాల్గుపాదములు, అవి.

ఎ) అవిద్యాపాదము – ఇది విశ్వపాదం. క్రిందిది

బి) సువిద్యాపాదము
సి) ఆనందపాదము
డి) తురీయపాదము
– ఇవి ఊర్ధ్వపాదాలు. శుద్ధజ్ఞానానంద స్వరూపమయిన అమృతరూపము.

ఇందులో మూలావిద్య ప్రథమపాదంలో ఉంటుంది. సువిద్యా ఆనంద తురీయపాదాలు. అన్ని పాదములందు అన్యోన్యం వ్యాపించి ఉంటాయి. వాటి నిష్పత్తిలో ప్రాధాన్యాన్ని బట్టి వాటికి ప్రత్యేకత, దానిని బట్టి పేరు. ఇందులో ఆనందపాద మధ్యంలో వైకుంఠం ఉంటుంది. ఇతర విషయాలు ఆ ఉపనిషత్తులో చూడదగును.

---

## శాంతి పాఠము

**సహ నావవతు, సహ నౌ భునక్తు, సహ వీర్యం కరవావహై,**
**తేజస్వి నా వధీతమస్తు, మావిద్విషావహై।** **2**
**ఓం శాంతిః శాంతిః శాంతిః॥**

**ప్రతిపదార్థం :–** నౌ = గురుశిష్యులమయిన మమ్ములను, సహ = కూడా, అవతు = ఆ బ్రహ్మము రక్షించుగాక! నౌ = మమ్ములను, సహ = కలిపి, భునక్తు = పాలించుగాక! వీర్యమ్ = బ్రహ్మవిద్యా నిమిత్తమయిన సామర్థ్యమును, సహ = కలిసి, కరవావహై = మేము ఇద్దరము చేసెదముగాక! నౌ = మా ఇద్దరియొక్క, అధీతం = అధ్యయనము, తేజస్వి = తేజస్సుగలది, అస్తు = అగుగాక! మా విద్విషావహై = అన్యోన్యపరాధాలవలన లేదా పొరపాట్లవలన, ద్వేషించికొనకుండా ఉండెదము గాక! ఓమ్ = ప్రధానరూప బ్రహ్మము,

శాంతిః = ఆధ్యాత్మిక శాంతి నిచ్చు గాక!,

శాంతిః = ఆధి భౌతిక శాంతినిచ్చు గాక!

శాంతిః = ఆధి దైవిక శాంతినిచ్చు గాక!

**తాత్పర్యం :–** ఈ శాంతి పాఠ ప్రయోజనం ఏమంటే, గురుశిష్యుల మధ్య పొరపాటువలన బ్రహ్మవిద్యా గ్రహణంలోగాని బోధనలోగాని దోషాలు దొర్లితే వాటి పరిహారం జరపడం. పరమేశ్వరుడు గురుశిష్యులమయిన మమ్ములను విద్యాస్వరూపం సాక్షాత్కరింపజేసి పరిపాలించుగాక! విద్యాఫలమును ప్రకాశింపజేసి మమ్ములను కాపాడుగాక! మేము మా విద్యాకృతమయిన సామర్థ్యాన్ని చూపెదము గాక! మా అధ్యయనము తేజస్సుగలది అనగా వీర్యవంతమగుగాక! అధ్యయన – అధ్యాపన క్రమంలో పొరపాటున జరిగే అన్యాయాలవలన మా మధ్య ద్వేషం రగులకుండా ఉండుగాక! సర్వదోష శాంతికి శాంతి పదము మూడుసార్లు చదవడం జరిగింది. అది దోషత్రయ శాంతికి సంకేతము.

(ఈ భావము కఠోపనిషద్భాష్యంలో శ్రీ శంకరులు చెప్పినది)

---

## తత్త్వ సంఖ్య

**"హరిః ఓమ్"**

**అథ ఋభుర్వై మహామునిః దేవమానేన ద్వాదశవత్సరం తపశ్చచార।**
**తదవసానే వరాహరూపీ భగవాన్ ప్రాదురభూత్ । 1**

**ప్రతిపదార్థం :–** అథ = తరువాత, ఋభుర్వై = ఋభువు అను, మహామునిః = మహర్షి, దేవమానేన = దేవకాలమానం ప్రకారం, ద్వాదశవత్సరమ్ = 12 సంవత్సరాలుగల, తపః =తపస్సును, చచార = చేసెను. తదవసానే = తపస్సుచివర, భగవాన్ = భగవంతుడు, వరాహరూపీ = వరాహరూపుడై, ప్రాదురభూత్ = ఆవిర్భవించెను.

**తాత్పర్యం :–** ఋభుమహర్షి దేవకాలమానం ప్రకారం 12 సంవత్సరాలు తపము చేయగా తపస్సు చివర సమయంలో భగవంతుడు వరాహావతారుడై ప్రత్యక్షమయ్యెను.

---

**స హోవాచ, ఉత్తిష్ఠోత్తిష్ఠ వరం వృణీష్వేతి। సోదతిష్ఠత్।**
**తస్మై నమస్కృత్యోవాచ॥ 2**





**ప్రతిపదార్థం:–** సః = ఆ వరాహరూప భగవానుడు, ఉవాచహి = పలికెను, ఉత్తిష్ఠ + ఉత్తిష్ఠ = లేలెమ్ము, వరం = నీవు కోరదలచిన విషయమును, వృణీష్వ = కోరుకొనుము – ఇతి = అని అనెను, సః = ఆ ఋభుమహర్షి, ఉదతిష్ఠత్ = లేచెను, తస్మై = ఆ వరాహమూర్తికి, నమస్కృత్య = నమస్కరించి, ఉవాచ = పలికెను.

**తాత్పర్యం :–** వరాహమూర్తి ప్రత్యక్షమయ్యెను. ఋభుమహర్షిని లెమ్మని చెప్పి వరములు కోరుకొమ్మనెను. అతడు లేచి స్వామికి నమస్కరించి యిట్లనెను.

**విశేషము :–** సః ఉదతిష్ఠత్ – ఇచ్చట సోదతిష్ఠత్ అను సంధి వైదికము.

---

**భగవన్! కామిభిః యద్యత్కామితం తత్**
**త్వత్సకాశాత్ స్వప్నేఽపి న యాచే॥ 3**

**ప్రతిపదార్థం :–** భగవన్! = ఓ స్వామీ! కామిభిః = కోరికలు గలవారిచేత, యద్యత్ = ఏదేది, కామితమ్ = కోరబడినదో, తత్ = ఆ కోరికను, త్వత్సకాశాత్ = నీనుండి, స్వప్నేఽపి = కలలో గూడా, న యాచే = కోరను.

**తాత్పర్యం :–** స్వామీ! సాధారణ వ్యక్తులు కోరే కోరికలను వేటిని నేను నీనుండి కోరను. స్వప్నంలో కూడా అట్టి కోరికలు కోరను.

---

**సమస్తవేదశాస్త్రేతిహాసపురాణాని, సమస్తవిద్యా జాలాని,**
**బ్రహ్మాదయః సురాః సర్వే, త్వద్రూపజ్ఞానాత్ ముక్తిమాహుః,**
**అతః త్వద్రూప ప్రతిపాదికాం బ్రహ్మవిద్యాం బ్రూహి – ఇతి**
**హోవాచ। తథేతి స హోవాచ వరాహరూపీ భగవాన్। 4**

**ప్రతిపదార్థం :–** సమస్త = అన్ని, వేద = వేదములు, శాస్త్ర = శాస్త్రములు, ఇతిహాస = ఇతిహాసములు (భారతం వంటివి) పురాణాని = పురాణములు, సమస్త = అన్ని, విద్యాజాలాని = విద్యా సమూహములు, బ్రహ్మా దయః = బ్రహ్మ మొదలగు, సురాః = దేవతలు, సర్వే = అందరును, త్వద్రూప = నీ రూపమయిన, జ్ఞానాత్ = జ్ఞానమువలననే, ముక్తిమ్ = మోక్షమును, ఆహుః = చెప్పిరి, అతః = అందువలన, త్వద్రూప = నీ రూపమును, ప్రతిపాదికామ్ = ప్రతిపాదించునటువంటి, బ్రహ్మ విద్యామ్ = బ్రహ్మవిద్యను, బ్రూహి = చెప్పుము, ఇతి = అని, ఉవాచ హ =

అనెను, సః = ఆ, వరాహరూపీ = వరాహావతారుడయిన, భగవాన్ = భగవంతుడు, తథేతి = అలాగేనని, ఉవాచ హ = పలికెను.

**తాత్పర్యం :–** సమస్తమయిన వేదశాస్త్ర పురాణేతిహాసాలు, విద్యా సమూహములు, బ్రహ్మాది దేవతలు అందరూ అన్ని మోక్షం నీ రూపమయిన జ్ఞానం వలన లేదా నీ స్వరూపం తెలిసికొనటం వలన వస్తుందని చెప్పారు. కనుక స్వామీ! తమ రూపాన్ని తెలియజెప్పే బ్రహ్మవిద్యను నాకు దయ చేయండి – అని ఋభుమహర్షి అడిగెను. అందుకు వరాహస్వామి అంగీకరించెను.

---

**చతుర్వింశతితత్త్వాని కేచిదిచ్ఛంతి వాదినః**
**కేచిత్ షట్త్రింశతత్త్వాని కేచిత్ షణ్ణవతీతి చ॥ 5**

**ప్రతిపదార్థం :–** కేచిత్ = కొంతమంది, వాదినః = సిద్ధాంతవాదులు, తత్త్వాని = తత్త్వములను, చతుర్వింశతి = 24 అని, ఇచ్ఛంతి = కోరుచున్నారు, కేచిత్ = కొందరు వాదులు, షట్త్రింశ = 26, తత్త్వాని = తత్త్వమును, కేచిత్ = కొందరు, షణ్ణవతీతి చ = '96' అని చెప్తున్నారు.

**తాత్పర్యం :–** కొందరు 24, కొందరు 36, మరికొందరు 96 అని తత్త్వాలను స్థూలంగానూ సూక్ష్మంగాను, మరింత సూక్ష్మంగానూ విభజించారు.

---

**తేషాం క్రమం ప్రవక్ష్యామి సావధానమనాః శృణు।**
**జ్ఞానేంద్రియాణి పంచైవ శ్రోత్రత్వగ్లోచనాదయః॥**
**కర్మేంద్రియాణి పంచైవ వాక్పాణ్యంఘ్ర్యాదయః క్రమాత్।**
**ప్రాణాదయస్తు పంచైవ పంచ శబ్దాదయస్తథా॥**
**మనోబుద్ధిరహంకారశ్చిత్తం చేతి చతుష్టయమ్।**
**చతుర్వింశతితత్త్వాని తాని బ్రహ్మవిదో విదుః॥ 6**

**ప్రతిపదార్థం :–** తేషామ్ = ఆ తత్త్వముయొక్క, క్రమమ్ = వరసను, ప్రవక్ష్యామి = చెప్పగలను, సావధాన = ఏకాగ్రమయిన, మనాః = మనస్సుగలవాడవై, శృణు = వినుము. శ్రోత్ర = చెవి, త్వక్ = చర్మము, లోచనాదయః = కన్నులు మొదలగు, జ్ఞానేంద్రియాణి = జ్ఞానేంద్రియములు, పంచైవ = ఐదే. క్రమాత్ = క్రమముగా,





వాక్ = వాక్కు, పాణి = చేతులు, అంఘ్ర్యాదయః = పాదములు మొదలగు, కర్మేంద్రియాణి = కర్మేంద్రియాలు, పంచైవ = ఐదే. ప్రాణాదయస్తు = ప్రాణము మొదలగునవి, పంచైవ = ఐదే, తథా = అలాగే, శబ్దాదయః = శబ్దము మొదలగునవి, పంచ = ఐదు, మనః =మనస్సు, బుద్ధిః = బుద్ధి, అహంకారః = అహంకారము, చిత్తం చేతి = చిత్తము అని, చతుష్టయమ్ = నాలుగు. తాని = వానిని, చతుర్వింశతి = 24అయిన, తత్త్వాని = తత్త్వములనుగా, బ్రహ్మవిదః = బ్రహ్మవేత్తలు, విదుః = తెలిసికొనినారు.

**తాత్పర్యం :–** జ్ఞానేంద్రియములు – 5 అవి చెవి, ముక్కు, కన్ను, చర్మము, నాలుక. కర్మేంద్రియములు – 5 – అవి వాక్కు, కాళ్లు, చేతులు, పాయు ఉపస్థలు.

ప్రాణాపానవ్యానోదానసమానములు – 5
శబ్ద స్పర్శ రూపరసగంధాలు – 5
మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తం – 4
పండితులు ఈ '24' తత్త్వాలను గుర్తించిరి.

---

**ఏతైస్తత్త్వైః సమం పంచీకృతభూతాని పంచ చ ।**
**పృథివ్యాపస్తథా తేజో వాయురాకాశమేవ చ ॥**
**దేహత్రయం స్థూలసూక్ష్మకారణాని విదుర్బుధాః ।**
**అవస్థాత్రితయం చైవ జాగ్రత్స్వప్నసుషుప్తయః ॥**
**ఆహత్య తత్త్వజాతానాం షట్త్రింశన్మునయో విదుః॥ 7**

**ప్రతిపదార్థం :–** ఏతైః = ఈ, తత్త్వైః = 24 తత్త్వాలతో, సమమ్ = తోడుగా, పృథివి = భూమి, ఆపః =నీరు, తేజః = అగ్ని, వాయుః = వాయువు, ఆకాశమేవ చ = ఆకాశము అని, పంచీకృత = పంచీకరింపబడిన, భూతాని = స్థూలభూతములు, పంచ చ = ఐదున్ను, స్థూల = స్థూల శరీరము, సూక్ష్మ = సూక్ష్మశరీరము, కారణాని = కారణ శరీరములను, దేహత్రయమ్ = మూడు శరీరాలు అని, బుధాః = పండితులు, విదుః = తెలిసికొనిరి. జాగ్రత్ = జాగరణము, స్వప్న = కల, సుషుప్తయః = సుషుప్తులు అని, అవస్థాత్రితయం చైవ = మూడు అవస్థలున్ను, ఆహత్య = కలిపి, తత్త్వజాతానాం = తత్త్వసమూహముల, షట్త్రింశత్ = '36' ను, మునయః = మునులు, విదుః = గుర్తించిరి.

**తాత్పర్యం :-** పైన చెప్పిన 24 తత్త్వాలకు, పంచీకృతమయిన స్థూలభూతాలు ఐదు, (భూమి, గాలి, అగ్ని, నీరు, ఆకాశము) అలాగే స్థూలసూక్ష్మ కారణములను దేహత్రయము, జాగరణ స్వప్న సుషుప్తులను మూడవస్థలు - కలిపి మొత్తం 24 + 5 + 3 + 3 = 35 తత్త్వాలు. (36 అని చెప్పారు. కాని 35 లెక్క వస్తున్నది. దీనికి జీవుని కలపాలి. '36' అవుతాయి.) అని ఋషులు చెప్పారు.

---

**పూర్వోక్తైస్తత్త్వజాతైస్తు సమం తత్త్వాని యోజయేత్।**<br>
**షడ్భావవికృతిశ్చాస్తి జాయతే వర్ధతేఽపి చ ।**<br>
**పరిణామం క్షయం నాశం షడ్భావవికృతిం విదుః ॥**<br>
**అశనా చ పిపాసా చ శోకమోహౌ జరా మృతిః।**<br>
**ఏతే షడూర్మయః ప్రోక్తాః షట్కోశానథ వచ్మి తే ॥**<br>
**త్వక్చ రక్తం మాంసమేదోమజ్జాస్థీని నిబోధత ।**<br>
**కామక్రోధౌలోభమోహౌ మదోమాత్సర్యమేవ చ ॥**<br>
**ఏతేఽరిషట్కా విశ్వశ్చ తైజసః ప్రాజ్ఞ ఏవ చ ।**<br>
**జీవత్రయం సత్త్వరజస్తమాంసి చ గుణత్రయమ్ ॥**<br>
**ప్రారబ్ధాగామ్యర్జితాని కర్మత్రయమితీరితమ్ ।** 7<br>
**వచనాదానాగమనవిసర్గానందపంచకమ్ ॥**<br>
**సంకల్పోఽధ్యవసాయశ్చ అభిమానోఽవధారణా ।**<br>
**ముదితా కరుణా మైత్రీ ఉపేక్షా చ చతుష్టయమ్ ॥**<br>
**దిగ్వాతార్కప్రచేతోఽ శ్వివహ్నీంద్రోపేంద్రమృత్యుకాః।**<br>
**తథా చంద్రశ్చతుర్వక్త్రో రుద్రః క్షేత్రజ్ఞ ఈశ్వరః ॥**<br>
**ఆహత్య తత్త్వజాతానాం షణ్ణవత్యస్తు కీర్తితాః ।** 8

**ప్రతిపదార్థం :-** దీనికి ప్రతిపదార్థం అవసరం లేదు. కేవలం 96 తత్త్వాలపేర్లు మాత్రమే. కనుక తాత్పర్యం చూడవలెను.



**తాత్పర్యం :-** 1. భావ వికారాలు - 6 (వికారం = మార్పు)

ఉండటం, పుట్టటం, పెరగటం, మారటం, తరగటం, నశించటం. ఒక పదార్థానికి జరిగే మార్పుల క్రమము. సంఖ్య.

2. షడూర్ములు - 6 (ఊర్మి = అల)

ఆకలి, దప్పిక, శోకం, మోహం, జర, మరణము.

3. షట్ కోశములు - 6

చర్మం, రక్తం, మాంసం, క్రొవ్వు, మజ్జ, అస్థి.

4. అరిషడ్వర్గము - 6

కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు.

5. జీవత్రయము - 3

విశ్వ తైజస ప్రాజ్ఞులు.

6. గుణత్రయము - 3

సత్త్వం - రజస్సు - తమస్సు

7. కర్మత్రయము - 3

ప్రారబ్ధం - సంచితం - ఆగామి

8. కర్మపంచకము - 5

వచనం, ఆదానం, ఆగమనం, విసర్గం, ఆనందము.

9. సంకల్పము, అధ్యవసాయము, అభిమానము, అవధారణ - 4

10. ముదిత, కరుణ, మైత్రి, ఉపేక్ష - 4

11. దిక్, వాతం, అర్క, వరుణ, అశ్వినులు, అగ్ని, ఇంద్ర, ఉపేంద్ర, మృత్యువులు. చంద్ర, బ్రహ్మ, రుద్ర, క్షేత్రజ్ఞ, ఈశ్వరులు - 14

మొత్తం - 60 వీనికి ఇంతకుముందు చెప్పిన 36 కలిపితే - 96 తత్త్వాలు.

**పూర్వోక్తతత్త్వజాతానాం వైలక్షణ్యమనామయమ్।।**<br>
**వరాహరూపిణం మాం యే భజంతి మయి భక్తితః।**<br>
**విముక్తాజ్ఞానతత్కార్యా జీవన్ముక్తా భవంతి తే।।**

**యే షణ్ణవతితత్త్వజ్ఞా యత్ర కుత్రాశ్రమే రతాః।**
**జటీ ముండీ శిఖీ వాపి ముచ్యతే నాత్ర సంశయః** **9**

ఇతి ప్రథమోఽధ్యాయః

**ప్రతిపదార్థం :-** పూర్వోక్త = పైన చెప్పబడిన, తత్త్వజాతానామ్ = తత్త్వసమూహములకు, వైలక్షణ్యం = భిన్నమయిన వాడును, అనామయమ్ = దోష రహితుడును, వరాహ రూపిణమ్ = వరాహస్వరూపమయిన, మామ్ = నన్ను, మయి= నాయందలి, భక్తితః = భక్తివలన, యే = ఎవరు, భజంతి = సేవించెదరో, తే = వారు, విముక్త = వదలబడిన, అజ్ఞాన = అవిద్య, తత్ = ఆ అవిద్యయొక్క, కార్యాః = కార్యమయిన ప్రపంచముగల వారయి, జీవన్ముక్తాః = జీవన్ముక్తులు, భవంతి = అగుదురు. యే = ఎవరు, షణ్ణవతితత్త్వ = 96 తత్త్వములను, జ్ఞాః = తెలిసిన వారై, యత్ర కుత్ర = ఏదో ఒక, ఆశ్రమే = ఆశ్రమమున, రతాః = ఆసక్తికలవారై అనగా, జటీ = జడలుదాల్చిన వాడై, ముండీ = గుండుచేయించికొన్నవాడై, శిఖీ వాపి = పిలకగలవాడై గాని ఉంటే, ముచ్యతే = ముక్తి పొందును. అత్ర = ఈ విషయంలో, సంశయః = సందేహం, న = లేదు.

అని ప్రథమాధ్యాయము.

**తాత్పర్యం:-**। 24, 36, 96 - ఇలాంటి తత్త్వాలన్నీ ప్రపంచాంతర్భూతాలు. వీటికతీతమయిన వాడు పరబ్రహ్మము. ఈ తత్త్వాలను జాగ్రత్తగా పరిశీలించి వీటియందు ఈశ్వరత్వము లేదని. గుర్తించి అతీతముగా వెలుగు పరమాత్మను - ప్రస్తుతం వరాహ రూపం దాల్చి ఉన్న - విష్ణువును సేవించిన వారు తప్పక అజ్ఞానాన్ని దాని వలన వచ్చిన ప్రపంచాన్ని పరిత్యజించి జీవన్ముక్తులగుదురు. ఈ తత్త్వజ్ఞానమును బాగా గ్రహించి వానియందు వ్యాపించియున్న ఈశ్వర తత్త్వాన్ని గ్రహించి వానప్రస్థంలో ఉన్నా (జటీ), సన్యాసంలో (ముండీ) ఉన్నా, గృహస్థ బ్రహ్మచర్యాలలో (శిఖీ) ఉన్నా - తప్పక సంశయరహితంగా ముక్తి పొందుతారు.

**ఇది ప్రథమాధ్యాయము**

---





# ద్వితీయోఽధ్యాయః

## బ్రహ్మవిద్యోపదేశము

**ఋభుర్నామ మహాయోగీ క్రోడరూపం రమాపతిమ్।**
**వరిష్ఠాం బ్రహ్మవిద్యాం త్వమధీహి భగవన్మమ॥** 10

**ప్రతిపదార్థం :-** ఋభుర్నామ = ఋభువని ప్రసిద్ధుడయిన, మహాయోగీ = ఒక మహాయోగి, క్రోడరూపమ్ = వరాహావతారరూపుడయిన, రమాపతిమ్ = శ్రియః పతిని ఇట్లడిగెను. భగవన్ = స్వామీ! త్వమ్ = నీవు, వరిష్ఠామ్ = చాలా గొప్పదయిన, బ్రహ్మవిద్యామ్ = బ్రహ్మ విద్యను, మమ = నాకు, అధీహి = చదువుము అనగా చెప్పుము.

**తాత్పర్యం :-** ఋభు యోగి వరాహావతారుడయిన లక్ష్మీపతిని తనకు బ్రహ్మ విద్యనుపదేశించుమని ప్రార్థించెను. అధీహి = అని అనటం ఉపనిషత్తులలో ఉన్నదే - "అధీహి భగవో బ్రహ్మేతి".

---

**ఏవం స పృష్టో భగవాన్ ప్రాహ భక్తార్తిభంజనః ।**
**స్వవర్ణాశ్రమధర్మేణ తపసా గురుతోషణాత్॥**
**సాధనం ప్రభవేత్పుంసాం వైరాగ్యాదిచతుష్టయమ్।**
**నిత్యానిత్యవివేకశ్చ ఇహాముత్ర విరాగతా॥**
**శమాదిషట్కసంపత్తిః ముముక్షా తాం సమభ్యసేత్ ।** **11**

**ప్రతిపదార్థం :-** ఏవమ్ = ఇలా, పృష్టః = అడుగబడినవాడై, సః = ఆ, భగవాన్ = వరాహభగవానుడు, భక్తార్తి = భక్తుని ఆపదను, భంజనః = పోగొట్టువాడై, ప్రాహ = పలికెను. పుంసామ్ = పురుషులకు, స్వ = తమ, వర్ణాశ్రమ = వర్ణాశ్రమములకు సంబంధించిన, ధర్మేణ = ధర్మముచేత, తపసా = తపస్సుచేత, గురు = గురువులయొక్క, తోషణాత్ = సంతోషపెట్టడం వలన, సాధనమ్ = మోక్ష సాధనమయిన, వైరాగ్యాది = వైరాగ్యం మొదలుగాగల, చతుష్టయమ్ = నాల్గు, ప్రభవేత్ = ఒనగూడును; నిత్య = ఆత్మ నిత్యమని, అనిత్య = సంసారం అనిత్యమని, వివేకశ్చ = వివేకమున్ను, ఇహ = ఇహలోకమునందు, అముత్ర =

పరలోకమునందున్ను, విరాగతా = విరక్తి, శమాది = శమదమాదులయిన, షట్క = "ఆఋ" యొక్క, సంపత్తిః = సంపద, ముముక్షా = మోక్షవాంఛ, తామ్ =దానిని, సమభ్యసేత్ = నేర్వవలెను.

**తాత్పర్యం :-** ఋభుమహర్షి వరాహభగవానుని మోక్షవిద్య నడుగగా ఆయన ఇట్లు చెప్పెను. వత్సా? జీవులు తమతమ వర్ణాశ్రమాచారధర్మమును నిర్వహించుచు, తపస్సు గురుసేవ చేయడం ద్వారా సాధనచతుష్టయమును పొందవచ్చును. సాధన చతుష్టయమనగా 1. ఆత్మ నిత్యమని, ఆత్మేతరమయిన సంసారము అనిత్యమని విచక్షణ కలగాలి.

2. ఇహలోక భోగాలమీద పరలోక భోగాలమీద విరక్తి కలగాలి.

3. శమ దమ ఉపరమ తితిక్షా సమాధాన శ్రద్ధలు - 6 కలగాలి.

శమము = మనోనిగ్రహం. దమము = బాహ్యేంద్రియ నిగ్రహం, ఉపరమం లేదా ఉపరతి = ఊరకొనటం, తితిక్ష = సహనం, సమాధానం = ఆత్మతత్త్వం పై ఏకాగ్రత. శ్రద్ధ = గురు శాస్త్రాదులయందు పరమ విశ్వాసము. - ఇవి ఆరు.

4. ముముక్ష - మోక్ష వాంఛ.

ఈ నాల్గు మోక్ష సాధనాలు సమకూరును.

---

**ఏవం జితేంద్రియో భూత్వా సర్వత్ర మమతామతిమ్॥**
**విహాయ సాక్షిచైతన్యే మయి కుర్యాదహంమతిమ్।** 12

**ప్రతిపదార్థం :-** ఏవమ్ = ఈవిధముగా, జిత = జయింపబడిన, ఇంద్రియః = ఇంద్రియములు గలవాడు, భూత్వా = అయి, సర్వత్ర = అంతట, మమతామతిమ్ = మమకారమును, విహాయ = విడిచి, సాక్షిచైతన్యే = సాక్షి చైతన్యమయిన, మయి = నాయందు, అహం మతిమ్ = "అహం" అనుబుద్ధిని, కుర్యాత్ = చేయవలయును.

**తాత్పర్యం :-** సాధన చతుష్టయ సంపత్తి గలిగి, జితేంద్రియుడై అంతట మమకారమును వదలి, నీయందే సర్వసాక్షి అయిన చైతన్యముగా నున్న నేనే నీవని బ్రహ్మాత్మైక్యభావమును కలిగియుండుము.

---





**దుర్లభం ప్రాప్య మానుష్యం తత్రాపి నరవిగ్రహమ్ ॥**
**బ్రాహ్మణ్యం చ మహావిష్ణోః వేదాంతశ్రవణాదినా ।**
**అతివర్ణాశ్రమం రూపం సచ్చిదానందలక్షణమ్ ॥**
**యో న జానాతి సోఽవిద్వాన్ కదా ముక్తో భవిష్యతి ।** 13

**ప్రతిపదార్థం :-**దుర్లభమ్ = దుర్లభమయిన, మానుష్యమ్ = మనుష్యజన్మను, తత్రాపి = అందులోనూ, బ్రాహ్మణ్యమ్ = బ్రాహ్మణ సంబంధమయిన, నరవిగ్రహమ్చ = మనుష్య శరీరమును, ప్రాప్యచ = పొంది గూడా, వేదాంత = వేదాంతముయొక్క, శ్రవణాదినా = శ్రవణం మననం మొదలయిన వానితో, అతివర్ణాశ్రమమ్ = వర్ణాశ్రమాతీతమయిన, మహావిష్ణోః = విష్ణువుయొక్క, సచ్చిదానందలక్షణమ్ = సచ్చిదానంద స్వరూపమయిన, రూపమును, యః = ఎవడయితే, న జానాతి = తెలిసికొనడో, సః = ఆ, అవిద్వాన్ = అజ్ఞాని, కదా = ఎపుడు, ముక్తః = ముక్తుడు, భవిష్యతి = కాగలడు.

**తాత్పర్యం :-** దుర్లభమయిన మనుష్య జన్మ పొంది, అందునా బ్రాహ్మణ శరీరమును పొంది, వేదాంతశ్రవణాదులు చేసి శ్రీమహావిష్ణువుయొక్క వర్ణాశ్రమా తీతమయి సచ్చిదానందరూపమయిన 'సాక్షి స్వరూపమును' తెలిసికొనని అజ్ఞాని ఎపుడు మోక్షమునందగలడు?

---

**అహమేవ సుఖం నాన్యదన్యచేన్నైవ తత్సుఖమ్ ॥**
**అమదర్థం న హి ప్రేయో, మదర్థం న స్వతఃప్రియమ్ ।**
**పరప్రేమాస్పదతయా మా న భూవమహం సదా ॥**
**భూయాసమితి యో ద్రష్టా సోఽహం విష్ణుర్మునీశ్వర ।** 14

**ప్రతిపదార్థం :-** మునీశ్వర! = మునీంద్రా!, అహమేవ = నేనే, సుఖమ్ = ఆనందమును, అన్యత్ = నాకన్న భిన్నమయిన దేదియు, న = సుఖముకాదు, అన్యచ్చేత్ = అన్యపదార్థమయితే, తత్ = అది, సుఖమ్ = సుఖము, నైవ = కానే కాదు. అమదర్థమ్ = ఆత్మరూపుడయిన నాకు కానిది, ప్రేయః =ప్రియమయినది, న హి = కాదు గదా! మదర్థం = నాకు కావలసినదే ప్రియము. స్వతః = స్వయంగా, తనకు తానుగా, ప్రియమ్ = ప్రియమయినది. న = లేదు. అహమ్ = నేను, సదా = ఎల్లప్పుడు, పర = పరమమయిన, ప్రేమాస్పదతయా = ప్రేమస్థానముగా, న

మా భూవమ్ = కాకుండా ఉండరాదు. భూయాసమ్ = పరమ ప్రేమాశ్రయుడుగా ఉండగలను, ఇతి = అని, యః = ఎవడు, ద్రష్టా = కనుగొనువాడో, సః = వాడు, అహం విష్ణుః = విష్ణువయిన నేనే.

**తాత్పర్యం :–** నేనే ఆనందరూపుడను. నన్ను మినహా ఏ పదార్థమూ ఆనంద రూపము కాదు. సంసారమంతా దుఃఖరూపము. నాకన్న భిన్నమయిన దేదయినా సుఖం కాదు. నేను ఆత్మ రూపుడను. ఏదయినా ఆత్మకు ఉపయోగించేదే ప్రియమయినది. “ఆత్మ నస్తు కామాయ సర్వం ప్రియం భవతి” అని గదా శ్రుతి. లోకంలో ప్రియమయిన వస్తువులు ఏవయినా నాకు అనగా ఆత్మకు ప్రియమయితేనే ప్రియము. అంతే తప్ప ఏ పదార్థమూ స్వతహాగా ప్రియము కాదు. అప్రియమూ కాదు. ఎల్లప్పుడూ “ఆత్మరూపుడయిన నేనే ప్రేమాస్పరుడును” అని తనను తాను తెలిసికొన్నవాడు నేను ఒక్కటే. మునీంద్రా!

---

**న ప్రకాశోఽహమిత్యుక్తిః యత్ప్రకాశైకబంధనా ॥**
**స్వప్రకాశం తమాత్మానం అప్రకాశః కథం స్పృశేత్ ।** **15**

**ప్రతిపదార్థం :–** అహమ్ = నేను, ప్రకాశః = జ్ఞానరూపుడను, న = కాను, ఇతి = అని, ఉక్తిః = చెప్పడం లేదా భావన, యత్ = ఏ పరమాత్మయొక్క, ప్రకాశ = ప్రకాశమునకు, ఏకబంధనా = ఒకే ముఖ్యావరణమో, తం = ఆ, స్వప్రకాశమ్ = స్వయం ప్రకాశుడయిన, ఆత్మానమ్ = పరమాత్మను, అ ప్రకాశః = జ్ఞానం లేనివాడు, జ్ఞానం కానివాడు, కథమ్ = ఎలా, స్పృశేత్ = తాకును.

**తాత్పర్యం :–** నేను ప్రకాశస్వరూపుడను. జీవులందరు ప్రకాశ స్వరూపులే. కాని అజ్ఞానంచేత ఎవడయితే తన జ్ఞానస్వరూపుడైన ఆత్మకాదని భావిస్తాడో అతడు ప్రకాశం అనగా జ్ఞానం లేనివాడు. అలా ఉన్నంతవరకు అతనికి ఆత్మజ్ఞానం రాదు. అందువలన అట్టి ప్రకాశశూన్యుడు స్వయం ప్రకాశమయిన ఆత్మను ఎలా తాకగలడు? లేదా ‘నేను అప్రకాశుడను” అన్న ప్రకాశమునకు గూడా ఆ ‘ప్రకాశమే’ కారణము. అట్టి స్వయంప్రకాశుని అప్రకాశము తాకలేదు.

---

**స్వయం భాతం నిరాధారం యే జానంతి సునిశ్చితమ్ ॥**
**తే హి విజ్ఞానసంపన్నా ఇతి మే నిశ్చితా మతిః ।** **16**



**ప్రతిపదార్థం :–** స్వయంభాతమ్ = స్వయం ప్రకాశుడును, నిరాధారమ్ = ఎటువంటి ఆధారములేనివాడును, అయిన పరమాత్మను, సునిశ్చితమ్ = నిశ్చయముగా, యే = ఎవరు, జానంతి = ఎరుగుదురో, తే హి = వారే, విజ్ఞానసంపన్నాః = బుద్ధిమంతులు, ఇతి = అని, మే = నాకు, నిశ్చితా = నిశ్చయమయిన, మతిః = బుద్ధిగలదు.

**తాత్పర్యము :–** సర్వాధారుడు నిరాధారుడు, స్వయంజ్యోతి అయిన పరమాత్మను ఆత్మగా ఎవరు నిశ్చయంగా తెలిసికొంటారో వారే నిజంగా విజ్ఞానవంతులని నా నిశ్చయము.

---

**సంపూర్ణాత్మాతిరేకేణ జగజ్జీవేశ్వరాదయః॥**
**న సంతి నాస్తి మాయా చ తేభ్యశ్చాహం విలక్షణః ।** **17**

**ప్రతిపదార్థం :–** సంపూర్ణ = అఖండమయిన, ఆత్మాతిరేకేణ = ఆత్మకు భిన్నంగా, జగత్ జీవ ఈశ్వరాదయః = జీవేశ్వర ప్రపంచములు, న సంతి = లేవు. మాయా చ = మాయయు, నాస్తి = లేదు. తేభ్యః చ = మాయాజీవేశ్వర ప్రపంచములకన్న, అహమ్ = నేను, విలక్షణః = భిన్నమయినవాడను.

**తాత్పర్యం :–** అఖండ సర్వవ్యాప్తమయిన పరమాత్మకన్న భిన్నంగా ప్రపంచంగాని, జీవేశ్వరులుగాని మాయగాని లేవు. అవి అన్నియు పరమాత్మ యందేర్పడినట్లే కనబడే మార్పులు. వివర్తములు. కనుక ఆత్మ కన్న భిన్నమయిన పదార్థాలు లేవు. అంటే తత్త్వరీత్యా లేనివి. మాయవలన ఏర్పడిన మార్పులు.

---

**అజ్ఞానాంధతమోరూపం కర్మధర్మాదిలక్షణమ్ ॥**
**స్వయంప్రకాశమాత్మానం నైవ మాం స్ప్రష్టుమర్హతి ।** **18**

**ప్రతిపదార్థం :–** అజ్ఞాన = అజ్ఞానం చేత, అంధ = గ్రుడ్డిదైన, తమోరూపమ్ = చీకటి వంటిదయిన, ధర్మాది = కర్మలు కర్తవ్యములు మొదలగు, లక్షణమ్ = లక్షణములుగల, కర్మ = కర్మ, స్వయంప్రకాశమ్ = స్వప్రకాశుడను, ఆత్మానమ్ = ఆత్మను అయిన, మామ్ = నన్ను, స్ప్రష్టుమ్ = తాకుటకయినను, నార్హతి ఏవ = తగనే తగను.

**తాత్పర్యం :-** ధర్మాధర్మస్వరూపమయిన కర్మము అజ్ఞానమనే గ్రుడ్డి చీకటికి రూపాంతరము. నేను స్వయంజ్యోతిని పరమాత్మను. నన్ను కర్మాదికము తాకజాలదు. అంటే తాను కర్మలవలన లభ్యం కాదు. అలాగే కర్మఫలాలు ఆత్మకు అంటవు. కనుక సాధకుడు తాను ఆత్మరూపుడనని గ్రహించడం వలన పాపరహితుడవుతాడు.

---

**సర్వసాక్షిణమాత్మానం వర్ణాశ్రమవిలక్షణమ్ ॥**
**బ్రహ్మరూపతయా పశ్యన్ బ్రహ్మైవ భవతి స్వయమ్ ।** **19**

**ప్రతిపదార్థం :-** సర్వసాక్షిణమ్ = దేహప్రపంచ వార్తలన్నింటికి సాక్షిభూతుడను. వర్ణాశ్రమ = వర్ణాశ్రమ ధర్మాలకు, విలక్షణమ్ = భిన్నమయిన వాడును, అగు, ఆత్మానమ్ = ఆత్మను, బ్రహ్మరూపతయా = బ్రహ్మరూపంగా, పశ్యన్ = చూచు జీవుడు, స్వయమ్ = స్వయంగా, బ్రహ్మైవ = బ్రహ్మమే, భవతి = అగును.

**తాత్పర్యం :-** 'బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి' అను సిద్ధాంతమే యిది. వర్ణాశ్రమ ధర్మాలు స్థూలశరీరానికి సంబంధించినవి. అట్టి స్థూల సూక్ష్మ శరీరాలకు అతీతమయిన ఆత్మ యీ సర్వ వ్యావహారిక విషయాలకు సాక్షి మాత్రమే. మన పనులకు సూర్యచంద్రులు సాక్షి , అన్నట్లు. అట్టి ఆత్మను బ్రహ్మంగా చూచువాడు తాను స్వయంగా బ్రహ్మ కాగలడు. అనగా ఆత్మయే బ్రహ్మమని తెలియడమంటే ఆత్మ బ్రహ్మం కావటమే గదా!

---

**భాసమానమిదం సర్వం భానరూపం పరం పదమ్ ॥**
**పశ్యన్ వేదాంతమానేన సద్య ఏవ విముచ్యతే ।** **20**

**ప్రతిపదార్థం :-** ఇదమ్ = ఈ, భాసమానమ్ = ఇంద్రియములకు అందుచున్న, సర్వమ్ = సమస్త ప్రపంచమును, వేదాంతమానేన = వేదాంత ప్రమాణంచేత, భానరూపమ్ = ప్రకాశరూపమయిన, పరమ్ = పరమమయిన, పదమ్ = స్థానముగా, ఓంకారముగా, పశ్యన్ = చూచు సాధకుడు, సద్య ఏవ = వెంటనే, విముచ్యతే = ముక్తుడగును.

**తాత్పర్యం :-** "సర్వం ఖల్విదం బ్రహ్మ" మొదలయిన ఉపనిషత్ప్రమాణముల బలంతో ఈ గోచరించే ప్రపంచమంతా ప్రకాశస్వరూపమయిన ఆ పరమపదమే ఓంకారమే అని చూచు ముముక్షువు వెంటనే మోక్షము పొందును.





**దేహాత్మజ్ఞానవత్ జ్ఞానం, దేహాత్మజ్ఞానబాధకమ్ ॥**
**ఆత్మన్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతే ।** **21**

**ప్రతిపదార్థం :-** దేహాత్మ = "దేహమే ఆత్మ" అను, జ్ఞాన = జ్ఞానమును, బాధకమ్ = బాధించునట్టి, జ్ఞానమ్ = జ్ఞానము, యస్య = ఎవరికి, దేహాత్మజ్ఞానవత్ = సహజంగా ఉండే దేహాత్మజ్ఞానం లాగా, ఆత్మన్యేవ = ఆత్మయందే, భవేత్ = కలుగునో, సః = అతడు, నేచ్ఛన్నపి = కోరక పోయినను, ముచ్యతే = విముక్తుడగును.

**తాత్పర్యం :-** మనకు దేహమే ఆత్మ అంటే ఈ "ఈ శరీరమే నేను" అనే భావన అచంచలంగా సహజంగా ఉంటుంది. కనుక అంత బలంగా ఎవడికయితే దేహం ఆత్మ కాదని, ఆత్మ దేహేంద్రియాదుల కన్న విలక్షణమని బ్రహ్మమేనని తాను ఆత్మనని జ్ఞానం ఏర్పడుతుందో వానికి – వద్దు బాబోయ్ – అన్నా మోక్షం వస్తుంది. అంటే అంతదాకా వచ్చిన జ్ఞాని మోక్షం వద్దనడు. కనుక మోక్షం అనివార్యంగా వస్తుందనడం కోసం అలా చెప్పారు.

---

**సత్యజ్ఞానానందపూర్ణలక్షణం తమసః పరమ్ ॥**
**బ్రహ్మానందం సదా పశ్యన్ కథం బధ్యేత కర్మణా ।** **22**

**ప్రతిపదార్థం :-** సత్య = సత్యము, జ్ఞాన = జ్ఞానము, ఆనంద = ఆనందము, పూర్ణ = పూర్ణము అయిన, లక్షణమ్ = లక్షణము గలదియు, తమసః = అజ్ఞానమునకు, పరమ్ = అతీతమయినదియు అగు, బ్రహ్మ = బ్రహ్మమును, ఆనందమ్ = ఆనందముగా, సదా = నిత్యము, పశ్యన్ = చూచువాడు, కర్మణా = కర్మచేత, కథమ్ = ఎట్లు, బధ్యేత = బంధింపబడును.

**తాత్పర్యం :-** అజ్ఞానానికి అవతల సత్యజ్ఞానానంద రూపమయి పూర్ణస్వరూపమయి యున్న బ్రహ్మమును ఆనందరూపముగా అనుభవించుచు ఉన్న జ్ఞానికి కర్మబంధము అసంభవము.

---

**త్రిధామసాక్షిణం సత్యజ్ఞానానందాదిలక్షణమ్ ॥**
**త్వమహంశబ్దలక్ష్యార్థమసక్తం సర్వదోషతః ।**
**సర్వగం సచ్చిదానందం జ్ఞానచక్షుః నిరీక్షతే॥** **23**

**ప్రతిపదార్థం :–** త్రిధామ = మూడుస్థానములకు, సాక్షిణమ్ = సాక్షియు, సత్యజ్ఞానానందాది = సత్యం జ్ఞానం ఆనందము మొదలగు, లక్షణమ్ = స్వరూప లక్షణములుగలవాడును, త్వం అహం శబ్ద = త్వం, అహం అనే శబ్దములకు, లక్ష్యార్థమ్ = లక్ష్యార్థమయిన వాడును, సర్వదోషతః = సమస్త దోషములనుండి, అసక్తమ్ = సంగము లేనివాడును, సర్వగమ్ = సర్వవ్యాప్తుడును అగు బ్రహ్మమును, జ్ఞానచక్షుః = జ్ఞాననేత్రము గలవాడు, సచ్చిదానందమ్ = సత్యజ్ఞానానంద స్వరూపునిగా, నిరీక్షతే = చూచును.

**తాత్పర్యం :–** మూడుదశలు జాగరణ స్వప్న సుషుప్తులు – వీనిలో సాక్షిగా నిలిచియుండువాడు, సత్యజ్ఞానానందములు స్వరూపంగాగల వాడు, "తత్త్వమసి, అహంబ్రహ్మాస్మి" అను మహావాక్యాలలో త్వం అహం అను పదాలకు లక్ష్యార్థమయిన శుద్ధ చైతన్యము, సకల దోషదూరము సర్వవ్యాప్తమూ – అయిన పరబ్రహ్మమును జ్ఞాని అయినవాడు సచ్చిదానంద స్వరూపునిగా దర్శిస్తాడు.

---

**అజ్ఞానచక్షుః నేక్షేత భాస్వంతం భానుమంధవత్ ।**
**ప్రజ్ఞానమేవ, తద్బ్రహ్మ సత్యప్రజ్ఞానలక్షణమ్ ॥**
**ఏవం బ్రహ్మపరిజ్ఞానాదేవ మర్త్యోఽమృతో భవేత్ ।** **24**

**ప్రతిపదార్థం :–** భాస్వంతమ్ = ప్రకాశించు, ఆ స్వయం జ్యోతిని, భానుమ్ = సూర్యుని, అంధవత్ = గ్రుడ్డివానివలె, అజ్ఞానచక్షుః = జ్ఞాననేత్రములేనివాడు, నేక్షేత = చూడలేడు. ప్రజ్ఞానమేవ = విజ్ఞానమే, సత్యప్రజ్ఞాన లక్షణమ్ = సత్యజ్ఞాన స్వరూపమయిన, తత్ = ఆ, ఏవమ్ = ఇలా, బ్రహ్మ = బ్రహ్మంయొక్క పరిజ్ఞానాదేవ = జ్ఞానం వలననే, మర్త్యః = మరణశీలుడయిన మానవుడు, అమృతః = అమృతుడు, భవేత్ = కాగలడు.

**తాత్పర్యం :–** గ్రుడ్డివాడు సూర్యుని చూడలేనట్లు అజ్ఞాననేత్రుడు స్వయంజ్యోతి అయిన భగవానుని చూడలేడు. ప్రజ్ఞానమే (జీవరూపమయిన బుద్ధి) సచ్చిదానంద స్వరూపమయిన ఆ బ్రహ్మము అనగా, "ప్రజ్ఞానం బ్రహ్మ" అని తెలిసినవానికే అమృతత్వం సిద్ధించును.

---





**తద్బ్రహ్మానందమద్వంద్వం నిర్గుణం సత్యచిద్ఘనమ్ ॥**
**విదిత్వా స్వాత్మనో రూపం న బిభేతి కుతశ్చన ।** **25**

**ప్రతిపదార్థం :–** ఆనందమ్ = ఆనంద స్వరూపము, అద్వంద్వమ్ = ద్వయ రహితము, నిర్గుణమ్ = సర్వగుణ రహితము, సత్యచిద్ఘనమ్ = సచ్చిత్ స్వరూపమును, అగు, తత్ = ఆ, బ్రహ్మ = బ్రహ్మమును, స్వాత్మనః = తనయొక్క, రూపమ్ = స్వరూపముగా, విదిత్వా = తెలిసి, కుతశ్చన = దేనినుండి, న బిభేతి = భయపడదు.

**తాత్పర్యం :–** 'ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన' అని మరొక ఉపనిషత్తుగూడా చెప్పింది. ఆనందరూపము, అద్వితీయము, నిర్గుణము, సచ్చిద్రూపము – అయిన ఆ పరబ్రహ్మమే తన ఆత్మరూపమని ఎరిగిన జ్ఞానికి దేనినుంచి భయము లేదు. అంతా తానే అయినపుడు ఎవరినుంచి భయపడతాడు. "ద్వితీయాద్వై భయం భవతి".

---

**చిన్మాత్రం సర్వగం నిత్యం సంపూర్ణం సుఖమవ్యయమ్ ॥**
**సాక్షాత్ బ్రహ్మైవ నాన్యోఽస్తీత్యేవం బ్రహ్మవిదాం స్థితిః ।** **26**

**ప్రతిపదార్థం :–** చిన్మాత్రమ్ = జ్ఞానమాత్ర స్వరూపమయినది, సర్వగమ్ = సర్వవ్యాప్తమయినది, నిత్యమ్ = నిత్యమయినది, అఖండమయినది, సుఖ రూపమయినది, నాశ రహితమయినది. సాక్షాత్ = నేరుగా, బ్రహ్మైవ = బ్రహ్మమే, అన్యః = బ్రహ్మేతర పదార్థము, నాస్తి = లేదు, ఇతి = అని, ఏవమ్ = ఈవిధంగా, బ్రహ్మవిదామ్ = బ్రహ్మవేత్తలయొక్క, స్థితిః = ప్రవర్తన ఉండును.

**తాత్పర్యం :–** సర్వవ్యాప్తము, నిత్యము, అఖండము, జ్ఞానమాత్రము, ఆనందము, అవ్యయము అయినది సాక్షాత్తూ బ్రహ్మం మాత్రమే. బ్రహ్మేతరమయినది ఏదీ వాస్తవంగా లేదు. అది మిధ్యగా కనబడినా అది బ్రహ్మంవలె సచ్చిదానందాది లక్షణాలు గలది కాదు. బ్రహ్మవేత్తల స్థితి యిది.

---

**అజ్ఞస్య దుఃఖౌఘమయం జ్ఞస్యానందమయం జగత్ ॥**
**అంధం భువనమంధస్య ప్రకాశం తు సుచక్షుషామ్ ।** **27**

**ప్రతిపదార్థం :-** జగత్ = ప్రపంచము, అజ్ఞస్య = అజ్ఞానికి, దుఃఖౌఘమయమ్ = దుఃఖసమూహమయంగా కనబడుతుంది. జ్ఞస్య = జ్ఞానికి, ఆనందమయమ్ = ఆనంద రూపముగా కనబడుతుంది. అంధస్య = గ్రుడ్డివానికి, భువనం = లోకము, అంధమ్ = గ్రుడ్డిది, తు = కాని, సుచక్షుషామ్ = నేత్రవంతులకు, ప్రకాశమ్ = వెలుగయినది.

**తాత్పర్యం :-** దృష్టిని బట్టి సృష్టి కనబడుతుంది. అజ్ఞానికి ప్రపంచం అంతా దుఃఖమయం. జ్ఞానికి అంతా బ్రహ్మం కనుక ఆనందమయం. ప్రపంచం గ్రుడ్డివానికి గ్రుడ్డిగా చీకటిగా, నేత్రవంతునకు వెలుగుగా కనబడుతుంది.

---

**అనంతే సచ్చిదానందే మయి వారాహరూపిణి ॥**
**స్థితేఽ ద్వితీయభావః స్యాత్ కో బంధః కశ్చ ముచ్యతే ।** **28**

**ప్రతిపదార్థం :-** అనంతే = అంత రహితుడను, సచ్చిదానందే = సత్యజ్ఞానానంద రూపుడను, వరాహరూపిణి = వరాహరూపుడనయిన, మయి = నాయందు, స్థితే = ఉన్న వానియందు, అద్వితీయభావః = అద్వైతము, స్యాత్ = ఉండును. బంధః = బంధము, కః = ఏది? కశ్చ = ఎవడు, ముచ్యతే = మోక్షము పొందును.

**తాత్పర్యం :-** అనంత సచ్చిదానందరూపుడయిన వరాహావతారుడయిన నాయందు ఆత్మభావంతో ఉన్నవానికి అద్వైతభావన వస్తుంది. అంతా ఆత్మరూపమే నన్న భావన వచ్చినవానికి - ఇక - ఏది బంధము? ఎవరికి ముక్తి?

---

**స్వస్వరూపం తు చిన్మాత్రం సర్వదా సర్వదేహినామ్ ॥**
**నైవ దేహాదిసంఘాతః ఘటవత్ దృశిగోచరః ।** **29**

**ప్రతిపదార్థం :-** సర్వదా = ఎల్లప్పుడు, సర్వదేహినామ్ = సకల దేహధారులకు, స్వస్వరూపం తు = నిజరూపమయితే, చిన్మాత్ర = జ్ఞానమే, ఘటవత్ = కుండవలె, దృశిగోచరః = దృశ్యమయిన, దేహాది = దేహేంద్రియములయొక్క, సంఘాతః = సమూహము, నైవ = నిజస్వరూపము కానేకాదు.

**తాత్పర్యం :-** సకల దేహధారులకు నిజస్వరూపము వారి దేహేంద్రియాది సమూహము కాదు. కాని లోకంలో అలా అనుకోవడం సహజము. వారి నిజస్వరూపం జ్ఞానము మాత్రమే.





**స్వాత్మనోఽన్యతయా భాతం చరాచరమిదం జగత్ ॥**
**స్వాత్మమాత్రతయా బుద్ధ్వా తదస్మీతి విభావయ।**
**స్వస్వరూపం స్వయం భుంక్తే నాస్తి భోజ్యం పృథక్ స్వతః ॥** **30**

**ప్రతిపదార్థం :-** స్వాత్మనః = తన ఆత్మకన్న, అన్యతయా = ఇతరంగా, భాతమ్ = ప్రకాశించుచున్న, ఇదమ్ = ఈ, చరాచరమ్ = స్థావరజంగమాత్మకమయిన, జగత్ = ప్రపంచమును, స్వాత్మమాత్రతయా = ఆత్మ స్వరూపముగా మాత్రమే, బుద్ధ్వా = గ్రహించి, తత్ = ఆ ప్రపంచము, అస్మి = నేనే, ఇతి = అని, విభావయ = విశేషంగా భావింపుము. స్వతః = తనకన్న, పృథక్ = విడిగా, భోజ్యమ్ = అనుభవింపదగిన ద్వితీయపదార్థము, నాస్తి = లేదు, అందువలన, స్వ = తన, స్వరూపమ్ = స్వరూపముగా, స్వయమ్ = తానే, భుంక్తే = అనుభవించును.

**తాత్పర్యం :-** తనకన్న భిన్నంగా కనిపించే యీ జగత్తు అంతా తన స్వరూపమే అని గ్రహించే, నేనే యిదంతా అని భావించుము. ప్రపంచమంతా తానే అయినపుడు ఇక అనుభవించే ఆనందము తన రూపమే.

---

**అస్తి చేదస్తితారూపం బ్రహ్మైవాస్తిత్వలక్షణమ్ ।**
**బ్రహ్మవిజ్ఞానసంపన్నః ప్రతీతమఖిలం జగత్ ॥**
**పశ్యన్నపి సదా నైవ పశ్యతి స్వాత్మనః పృథక్ ।**
**మత్స్వరూపపరిజ్ఞానాత్ కర్మభిః న స బధ్యతే॥** **31**

**ప్రతిపదార్థం :-** అస్తి చేత్ = ఏదయిన ఉన్నట్లయితే, అస్తితా = ఆ ఉనికియొక్క రూపము, అస్తిత్వ = ఉనికియే, లక్షణమ్ = స్వరూపముగాగల, బ్రహ్మైవ = బ్రహ్మమే అగును. బ్రహ్మవిజ్ఞాన = బ్రహ్మజ్ఞానంతో, సంపన్నః = కూడినవాడు, ప్రతీతమ్ = ఉన్నట్లు కనబడుతున్న, అఖిలమ్ = సమస్తమయిన, జగత్ = ప్రపంచమును, సదా = నిత్యం, పశ్యన్నపి = చూచుచు గూడా, స్వాత్మనః = తన కన్న, పృథక్ = వేరుగా, నైవ పశ్యతి = చూడడు. మత్ = నాయొక్క, స్వరూప = స్వరూపమయిన, ఆత్మ తత్త్వముయొక్క, పరిజ్ఞానాత్ = జ్ఞానంవలన, సః = అలా చూచుజ్ఞాని, న బధ్యతే = బంధింపబడడు.

**తాత్పర్యం :-** ఏదయినా పదార్థం ఉన్నది అంటే అక్కడ నిజంగానే ఉన్నది బ్రహ్మమే. కుండ ఉన్నది అంటే ఉన్నది మట్టియే. రజ్జుసర్పభ్రాంతిలో సర్పమున్నది అంటే ఉన్నది రజ్జువే. బ్రహ్మ విజ్ఞానం గలవాడు, తాను నిత్యం చూచే ప్రపంచమును ప్రపంచంగాగాక బ్రహ్మంగాను ఆత్మ తత్త్వంగాను చూస్తాడు. సర్వమును బ్రహ్మంగా చూచే అటువంటి జ్ఞానికి కర్మబంధాలుండవు.

---

**యశ్శరీరేంద్రియాదిభ్యో విహీనం సర్వసాక్షిణమ్ ।**
**పరమార్థైకవిజ్ఞానం సుఖాత్మానం స్వయంప్రభమ్॥**
**స్వస్వరూపతయా సర్వం వేద స్వానుభవేన యః॥**
**స ధీరః స తు విజ్ఞేయః సోఽహం, తత్త్వమృభో!భవ॥ 32**

**ప్రతిపదార్థం :-** యః = ఎవడు, శరీరేంద్రియాదిభ్యః = శరీరేంద్రియాదులవలన, విహీనమ్ = లేనివాడును, సర్వసాక్షిణమ్ = సర్వసాక్షిగా ఉన్నవాడును, పరమార్థ = తత్త్వరీత్యా, ఏకవిజ్ఞానం = ఒకే జ్ఞానరూపముగలవాడును, సుఖాత్మానమ్ = ఆనంద రూపుడును, స్వయంప్రభమ్ = స్వయం జ్యోతియును, అయిననన్ను, వేద = ఎరుగునో, యః = ఎవడు, సర్వమ్ = సమస్తమును, స్వస్వరూపతయా = నిజరూపముగా, స్వానుభవేన = తన అనుభవంతో, వేద = ఎరుగునో, సః = అతడు, ధీరః = ధీరుడు, సః తు = అతడే, విజ్ఞేయః = తెలిసికొనదగినవాడు, సః = వాడు, అహమ్ = నేను కనుక, ఋభో! = ఋభుమహర్షీ!, త్వమ్ = నీవు, తత్ = ఆ పరమాత్మతత్త్వమే, భవ = కావలసినది.

**తాత్పర్యం :-** శరీరేంద్రియాదిరహితుడై సర్వసాక్షిగా ఉన్న అఖండతత్త్వమయిన ఆనందరూపమయిన స్వయం జ్యోతిని ఎరిగిననాడు, తన అనుభవం ద్వారా సమస్తం తనరూపంగా ఎరిగినవాడు ధీరుడు. జ్ఞేయుడు. అతడు నేనే. బ్రహ్మవేత్త బ్రహ్మయే గదా! కనుక ఋభుమహర్షీ! అది నీవే కమ్ము!

---

**అతః ప్రపంచానుభవః సదా న హి**
**స్వరూపబోధానుభవః సదా ఖలు ।**
**ఇతి ప్రపశ్యన్ పరిపూర్ణవేదనో**
**న బంధముక్తో న చ బద్ధ ఏవ తు॥ 33**





**ప్రతిపదార్థం :-** అతః = ఇందువలన, ప్రపంచానుభవః = ప్రపంచ సంబంధమయిన, అనుభవః = అనుభవము, సదా = నిత్యమయినది, నహి = కాదు గదా! స్వరూపబోధ = స్వరూప జ్ఞానంయొక్క, అనుభవః = అనుభవము, సదా = నిత్యమయినది, ఖలు = కదా!, ఇతి = అని, ప్రపశ్యన్ = దర్శిస్తూ ఉన్న, పరిపూర్ణవేదనః = పూర్ణజ్ఞాని, బంధముక్తః = బంధం నుండి ముక్తుడుగాడు. తు = కాని, బద్ధ ఏవ = బంధంలో ఉన్నవాడే, న = కాడు.

**తాత్పర్యం :-** కనుక ప్రపంచం సత్యంకాదు. నిత్యం కాదు. కనుక దాని అనుభవం కూడా అంతే. కాని నిత్యమయినది సత్యమయినది మన స్వరూపం. అందువలన దాని అనుభవము గూడా నిత్యసత్యమే. ఇలా భావించి జ్ఞాన పూర్ణుడయినవానికి బ్రహ్మం తప్ప మరేదీ కనబడదు. ప్రపంచం లేదు. అది బ్రహ్మస్వరూపమే. ఆ బ్రహ్మం తనే కనుక బంధింపబడిన వాడూ లేడు. అలాంటపుడు ముక్తుడయినవాడూ లేడు. కనుక అంతా మిథ్య. బ్రహ్మైకైక్యము సత్యం.

---

**స్వస్వరూపానుసంధానాన్నిత్యం తం సర్వసాక్షిణమ్ ।**
**ముహూర్తం చింతయేన్మాం యః సర్వబంధైః ప్రముచ్యతే॥ 34**

**ప్రతిపదార్థం :-** యః = ఎవడు, నిత్యమ్ = నిత్యుడును, తమ్ = బ్రహ్మరూపుడును, సర్వసాక్షిణమ్ = సకలమునకు సాక్షియు, అగు, మామ్ = నన్ను, స్వస్వరూప = నిజస్వరూపముయొక్క, అనుసంధానాత్ = నిత్య భావన చేయడం వలన, ముహూర్తమ్ = ఒక ముహూర్తకాలము, చింతయేత్ = తలచునో, వాడు, సర్వబంధైః = సకల బంధములతో, ప్రముచ్యతే = విడిచి పెట్టబడును.

**తాత్పర్యం :-** నిత్యుడును, స్వరసాక్షిని, అయిన నన్ను ఎవరు స్వస్వరూపమును అనుసంధానం చేస్తూ ముహూర్తకాలం ధ్యానం చేయునో వాడు సర్వబంధము నుండి విముక్తుడగును.

---

**సర్వభూతాంతరస్థాయ నిత్యముక్తచిదాత్మనే ।**
**ప్రత్యక్చైతన్యరూపాయ మహ్యమేవ నమో నమః॥ 35**

**ప్రతిపదార్థం :–** సర్వభూత = సకల భూతములయొక్క, అంతరస్థాయ = అంతర్యామి అయినవాడు, నిత్య = నిత్యుడును, ముక్త = ముక్తుడును, చిదాత్మనే = జ్ఞాన స్వరూపుడును, ప్రత్యక్ = దేహేంద్రియాదుల కన్న భిన్నమయిన, చైతన్య = చైతన్యమే, రూపాయ = స్వరూపముగా గలవాడును అగు, మహ్యమ్ = ఆత్మరూపుడనయిన నాకు, నమో నమః = ప్రతిబింబ రూపుడనయిన నేను నమస్కరించెదను.

**తాత్పర్యం :–** సర్వభూతాంతర్యామి, నిత్యముక్తజ్ఞానస్వరూపుడు, నాయందు శరీరేంద్రియాదుల కతీతంగా సాక్షిగా నాలో ప్రత్యగాత్మగా ఉన్న బింబరూపుడనయిన నాకు, వ్యావహారిక జీవుడనయిన నేను నమస్కరించుచున్నాను.

శరీరంలో ఉన్న చైతన్యం సాక్షి. దానికి అంతఃకరణంలో పడిన ప్రతిబింబం జీవుడు. ఈ ప్రతిబింబ చైతన్యంవలన మనస్సే జీవుడుగా వ్యవహరిస్తుంది. కనుక వ్యావహారిక జీవుడు అసలు జీవునకు నమస్కరించుచున్నాడు. శ్రీ బెల్లంకొండ రామారావుగారు ఆత్మాష్టకం అనే పేరుతో ఇలాగే ఆత్మస్తోత్రం చేశారు.

---

**త్వం వాహమస్మి భగవోఽహం వై త్వమసి దేవతే ।**
**తుభ్యం మహ్యమనంతాయ మహ్యం తుభ్యం చిదాత్మనే ॥**
**నమో మహ్యం పరేశాయ నమస్తుభ్యం శివాయ చ ।** **36**

**ప్రతిపదార్థం :–** భగవః = భగవన్, త్వమ్ = నీవు, అహమ్ = నేను, అస్మివా = అగుదునా? దేవతే = ఓ దేవతా!, అహమ్ = నేను, త్వమ్ = నీవు, అసివై = అగుచున్నావా! అనంతాయ = అనంతుడవయిన, తుభ్యమ్ = నీకు, మహ్యమ్ = నాకు, చిదాత్మనే = జ్ఞానరూపుడనయిన, మహ్యమ్ = నాకు, తుభ్యమ్ = నీకు, పరేశాయ = పరమేశ్వరుడనయిన, మహ్యమ్ = నాకు, నమః = నమస్కారము, శివాయ = శివుడవయిన, తుభ్యం చ = నీకున్ను, నమః = నమస్కారము.

**తాత్పర్యం :–** భగవన్! వరాహదేవా! అహంబ్రహ్మాస్మి, తత్ త్వమసి – అని ఈ ప్రకారం ఆలోచించి సాధకుడిట్లు భావించును. నేను నీవగుదునా! నీవు నేనగుదునా! అందరు బ్రహ్మమయినపుడు అంతే గదా! ఆత్మ పరమాత్మ అనగా నీవు నేను అనంతులము, చిదాత్ములము. పరమేశ్వరులము. పరమశివులము. అందువలన నాకు నీకు అనగా ఆత్మకు పరమాత్మకు నమస్కారము.

---





**కిం కరోమి క్వ గచ్ఛామి కిం గృహ్ణామి త్యజామి కిమ్॥**
**యన్మయా పూరితం విశ్వం మహాకల్పాంబునా యథా ।** **37**

**ప్రతిపదార్థం :–** మయా = నాచేత, మహాకల్పాంబునా యథా = ప్రలయకాలజలము చేతలాగా, విశ్వమ్ = ప్రపంచము, పూరితం యత్ = వ్యాపింపబడిన కారణముగా, కిం కరోమి = ఏమి చేయగలను? క్వ = ఎచ్చట, గచ్ఛామి = పోగలను. కిమ్ = దేనిని, గృహ్ణామి = గ్రహించగలను? కిమ్ = దేనిని, త్యజామి = విడిచి పెట్టగలను.

**తాత్పర్యం :–** ప్రలయకాల సముద్రజలము ప్రపంచంలో ప్రతి అణువు వ్యాపించినట్లు ఈ ప్రపంచమంతా ఆత్మ రూపుడనయిన నాచే వ్యాపింపబడినది. ఇక ఈ విశ్వములో నేను తప్ప మరెవరూ లేరు. చేయాలంటే ఏమి చేయగలను? ఎక్కడకు పోగలను? ఏది స్వీకరించగలను? ఏది వదలగలను? అంతా నేనే గదా!

---

**అంతస్సంగం బహిస్సంగం ఆత్మసంగం చ యః త్యజేత్ ।**
**సర్వసంగనివృత్తాత్మా స మామేతి న సంశయః॥** **38**

**ప్రతిపదార్థం :–** అంతస్సంగమ్ = లోపలి సంగమును, బహిస్సంగమ్ = బాహ్య సంగమును, ఆత్మసంగమ్ = ఆత్మ సంగమును, యః = ఎవడు, త్యజేత్ = వదలునో, సర్వ = సమస్తమయిన, సంగ = సంగమునుండి, నివృత్త = మరలిన, ఆత్మా = మనస్సుగల, సః = ఆ ముముక్షువు, మామ్= నన్ను, ఏతి = పొందును. సంశయః = సందేహము, న = వద్దు.

**తాత్పర్యం :–** తన లోపలి సుఖదుఃఖాలతోను బాహ్యమయిన విషయాలతోనూ తాను జీవుడననే భావనతోను – సంగమును వదలి కొనవలెను. సర్వసంగమును వదలికొనిన పురుషుడు తప్పక నన్ను చేరును.

---

**అహిరివ జనయోగం సర్వదా వర్జయేద్యః**
**కుణపమివ సునారీం త్యక్తకామో విరాగీ ।**
**విషమివ విషయాదీన్ మన్యమానో దురంతాన్**
**జగతి పరమహంసో వాసుదేవోఽహమేవ॥** **39**

**ప్రతిపదార్థం :–** త్యక్త = వదలబడిన, కామః = కోరికలుగల, విరాగీ = వైరాగ్యశాలి, అయిన, యః = ఎవడు, అహిరివ = పామువలె, సర్వదా = నిత్యము, జనయోగమ్ = జన సంబంధమును, వర్జయేత్ = వదలునో, సునారీమ్ =అందమయిన స్త్రీని, కుణపమివ = శవమునువలె, వర్జయేత్ = విడిచిపెట్టునో, విషయాదీన్ = విషయాదులను, దురంతాన్ = విషమ ఫలమయినవిగా, మన్యమానః = తలచుచు, విషమివ = విషమును వలె, వర్జయేత్ = వదలునో, జగతి = జగత్తునందు, పరమహంసః = పరమహంసగా ఉన్న ఆ పురుషుడు, వాసుదేవః = సర్వవ్యాప్త దేవుడయిన, అహమేవ = నేనే.

**తాత్పర్యం :–** సర్పమువలె జనానికి దూరంగా ఏకాంతంలో ఉండి విరాగియై సుందరీ రత్నమును సైతము శవమునువలె భావించి నిష్కాముడై, విషయాల పర్యవసానము సంసారరూప దుష్ఫలమని గుర్తించి ప్రపంచమునందు వివేకముగా ఆత్మబుద్ధితో సంచరించు పరమహంస నేనే. వాసుదేవుడే.

---

**ఇదం సత్యమిదం సత్యం సత్యమేతదిహోచ్యతే ।**
**అహం సత్యం పరం బ్రహ్మ మత్తః కించిన్న విద్యతే॥ 40**

**ప్రతిపదార్థం :–** ఇదమ్ = ఇది, సత్యమ్ = సత్యము, ఇదమ్ = ఇది, సత్యమ్ = సత్యము, ఏతత్ =ఇది, సత్యమ్ = సత్యము. ఇహ = ఇచ్చట, ఉచ్యతే = చెప్పబడుచున్నది. అహమ్ = నేను, సత్యమ్ = సత్యమయిన, పరమ్ = పరమమయిన, బ్రహ్మ = బ్రహ్మమును, మత్తః = నా కన్న భిన్నంగా, కించిత్ = ఏదియును, న విద్యతే = లేదు.

**తాత్పర్యం :–** ఇది సత్యం. ఇది సత్యం. ఇది సత్యం. అనగా ముమ్మాటికి ఇది సత్యము. నేను సత్యమయిన పరబ్రహ్మమును. నాకన్న భిన్నముగా ఏదీ లేదు.

---

**ఉప సమీపే యో వాసః జీవాత్మపరమాత్మనోః।**
**ఉపవాసస్స విజ్ఞేయః న తు కాయస్య శోషణమ్ ॥ 41**

**ప్రతిపదార్థం :–** ఉప = ఉప అనగా, జీవాత్మ పరమాత్మనోః = జీవేశ్వరులయొక్క సమీపే = సమీపమునందు, వాసః = ఉండుట, యః = ఏదిగలదో, సః = అది, ఉపవాసః = ఉపవాసమని, విజ్ఞేయః = ఎరుగదగినది. తు = కాని, కాయస్య = శరీరముయొక్క, శోషణమ్ = ఎండగట్టుట, న = కాదు.

**తాత్పర్యం :–** జీవేశ్వరుల సమీపవాసమే అనగా వారి తాదాత్మ్యభావనయే ఉపవాసము. అంతేగాని జడమయిన శరీరమును శుష్కింపజేయుట కాదు.

---

**కాయశోషణమాత్రేణ కా తత్ర హ్యవివేకినామ్ ।**
**వల్మీకతాడనాదేవ మృతః కిం ను మహోరగః॥ 42**

**ప్రతిపదార్థం :–** కాయ = శరీరముయొక్క, శోషణ = ఎండగట్టుట, మాత్రేణ = మాత్రం చేతనే, తత్ర = ఆ మోక్షం విషయంలో, అవివేకినామ్ = ఆత్మానాత్మ వివేకము లేనివారికి, కా, హి = ఏమి ఉన్నది. వల్మీక = పుట్టయొక్క, తాడనాదేవ = కొట్టడం వలననే, మహోరగః = పుట్టలోని మహాసర్పము, కిం మృతః ను = చచ్చిపోయినదా?

**తాత్పర్యం :–** ఆత్మ – అనాత్మలమధ్య వివేకం లేనివానికి శరీరాన్ని ఎండగట్టడం వలన ప్రయోజనం ఏమి ఉన్నది. శరీరం చెడటమే గదా? పుట్టపై దెబ్బ వేసినంత మాత్రమున పుట్టలోని సర్పము చచ్చునా?

---

**అస్తి బ్రహ్మేతి చేద్వేద పరోక్షజ్ఞానమేవ తత్ ।**
**అహం బ్రహ్మేతి చేద్వేద సాక్షాత్కారః స ఉచ్యతే॥ 43**

**ప్రతిపదార్థం :–** బ్రహ్మ = బ్రహ్మమను పదార్థమొకటి, అస్తి = ఉన్నది, ఇతి = అని, వేదచేత్ = ఎరిగినచో, తత్= ఆ జ్ఞానము, పరోక్ష = పరోక్షమయిన, జ్ఞానమేవ = జ్ఞానమే. అహమ్ = నేను, బ్రహ్మేతి = బ్రహ్మమునని, వేదచేత్ = ఎరిగినచో, సః = అది, సాక్షాత్కారః = సాక్షాత్కారమని, ఉచ్యతే = చెప్పబడును.

**తాత్పర్యం :–** బ్రహ్మపదార్థ మొకటి యున్నదని గ్రహించిన వాని జ్ఞానము పరోక్ష జ్ఞానము. అది ప్రత్యక్ష జ్ఞానము కాదు. నేనే బ్రహ్మమును, అని గ్రహించినవాని జ్ఞానము ప్రత్యక్ష జ్ఞానము.

---

**యస్మిన్ కాలే స్వమాత్మానం యోగీ జానాతి కేవలమ్ ।**
**తస్మాత్ కాలాత్ సమారభ్య జీవన్ముక్తో భవేదసౌ॥**
**అహం బ్రహ్మేతి నియతం మోక్షహేతుర్మహాత్మనామ్ । 44**

**ప్రతిపదార్థం :-** యోగీ = జ్ఞానయోగి, యస్మిన్ = ఏ, కాలే = క్షణకాలమునందు, స్వమ్ = తనను, కేవలమ్ = కేవలమయిన, ఆత్మానమ్ = ఆత్మనుగా, జానాతి = ఎరుగునో, తస్మాత్ = ఆ, కాలాత్ = కాలమునుండి, సమారభ్య = మొదలుపెట్టి, అసౌ = ఆ జీవుడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడు, భవేత్ = కాగలడు, మహాత్మనాం = గొప్పవారికి, అహం బ్రహ్మ = నేను బ్రహ్మమును, ఇతి = అను భావన, నియతమ్= తప్పక, మోక్షహేతుః = మోక్షకారణము గదా!

**తాత్పర్యం :-** ఏ క్షణంలో యోగికి తాను కేవలాత్మరూపుడని అనుభవం ఏర్పడుతుందో ఆ క్షణమునుంచి అతడు జీవన్ముక్తుడగును. “అహం బ్రహ్మ, సోఽహం వంటి అనుభవమే మహాత్ములకు నిశ్చయమయిన మోక్షకారణము.

---

**ద్వే పదే బంధమోక్షాయ నిర్మమేతి మమేతి చ ॥**
**మమేతి బధ్యతే జంతుః నిర్మమేతి విముచ్యతే । 45**

**ప్రతిపదార్థం :-** నిర్మమేతి = నాది కాదనుమాట, మమేతి చ = నాది అను మాట, యీ, ద్వే = రెండు, పదే = పదములు, బంధమోక్షాయ = బంధ మోక్షములకొరకు పనికివచ్చును. జంతుః = జీవి, మమేతి = నాది / నాతు అని, బధ్యతే = బంధింపబడును. నిర్మమేతి = నాది కాదనటం ద్వారా, విముచ్యతే = విడువబడును.

**తాత్పర్యం :-** మమకారం బంధం. మమకారరాహిత్యం మోక్షం కనుక అహంకారం వలన వచ్చే యీ మమకారానికి సూచన “మమ” అను పదం. అందువలన నమమ / నిర్మమ అనటం మమకార శూన్యమయిన జ్ఞానము. అది మోక్షకారణం. ఇటువంటి శ్లోకం ఇతరత్ర కొంచెం పాఠభేదంతో ఉన్నది.

“మమేతి న మమేతి చ – న మమేతి విముచ్యతే” – ఈ పాఠం వ్యాకరణ యుక్తం. శ్రవణ సుఖం.

---





**బాహ్యచింతా న కర్తవ్యా తథైవాంతరచింతికా ॥**
**సర్వచింతాం సముత్సృజ్య స్వస్థో భవ సదా ఋభో! । 46**

**ప్రతిపదార్థం :-** బాహ్య = బాహ్య విషయాలకు సంబంధించిన, చింతా = విచారము, న కర్తవ్యా = చేయదగినది కాదు. తద్దైవ = అట్లే, న అంతరచింతికా = అంతర విషయముల చింతన చేయదగదు. సర్వచింతామ్ = అన్ని రకాల చింతలను, సముత్సృజ్య = విడిచిపెట్టి, ఋభో! = ఋభు మహర్షీ! సదా = నిరంతరము, స్వస్థః = ఆత్మనిష్ఠుడవై, భవ = ఉండుము.

**తాత్పర్యం :-** బాహ్య విచారణలు, అంతర విచారణలు మానవలెను. సర్వచింతలనూ వదలి ఋభుమహర్షీ! నిత్యము ఆత్మనిష్ఠుడవై యుండుము.

---

**సంకల్పమాత్రకలనేన జగత్సమగ్రం**
**సంకల్పమాత్రకలనే హి జగద్విలాసః ।**
**సంకల్పమాత్రమిదముత్సృజ నిర్వికల్ప -**
**మాశ్రిత్య మామకపదం హృది భావయస్వ॥ 47**

**పతిపదార్థం :-** సంకల్పమాత్ర = కేవల సంకల్పముయొక్క, కలనేన = చేయుటచేత, జగత్ = ప్రపంచము, సమగ్రమ్ = సంపూర్ణమయినది. సంకల్పమాత్ర = కేవల సంకల్పముయొక్క, కలనే = చేయుట యందే, జగత్ = ప్రపంచముయొక్క, విలాసః = విలాసము, ఇదమ్ = ఈ సంసార వ్యవహారమంతా, సంకల్పమాత్రమ్ = కేవలం సంకల్పమే. ఉత్సృజ = వదలిపెట్టుము. నిర్వికల్పమ్ = వికల్పరాహిత్యమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, హృది = హృదయమునందు, మామక = నాదయిన, పదమ్ = స్థానమును, భావయస్వ = భావింపుము.

**తాత్పర్యం :-** ప్రపంచం ఏర్పడింది సంకల్పమాత్రం చేతనే. కేవల సంకల్పమునందే ఈ ప్రపంచము నడుస్తున్నది. ఇదంతా కేవల సంకల్పమే. ఎదురుగా కనబడే యీ ప్రపంచమంతా మన విజ్ఞానమే. అదే అలా కనబడుతున్నది. స్వప్న సదృశం. కనుక దీనిని వదలి సర్వవికల్ప శూన్యమయిన స్థితిని ఆశ్రయించి నా పదమును నీ మనస్సులో నిత్యమూ భావింపుము.

---

**మచ్చింతనం మత్కథనం అన్యోన్యం మత్ప్రభాషణమ్ ।**
**మదేకపరమో భూత్వా కాలం నయ మహామతే! ॥ 48**

**ప్రతిపదార్థం :–** మహామతే! = బుద్ధిశాలీ!, మత్ = నాయొక్క, చింతనమ్ = ధ్యానము, మత్ = నాయొక్క, కథనమ్ = కథాదులు చెప్పటం, అన్యోన్యమ్ = పరస్పరము, మత్ = నా గురించి, ప్రభాషణమ్ = సంభాషించి కొనుటయు చేయుచు, మదేక = నేనొక్కడనే, పరమః = అంతిమలక్ష్యం గలవాడవుగా, భూత్వా = అయి, కాలమ్ = కాలమును, నయ = గడపుము.

**తాత్పర్యం :–** నన్ను తలచటం, నా కథలు చెప్పటం, నా విషయాలను అన్యోన్యం సంభాషించడం – ఇలా చేస్తూ నేనే చరమలక్ష్యంగా కాలము గడపుము.

---

**చిదిహాస్తీతి చిన్మాత్రమిదం చిన్మయమే వచ ।**
**చిత్త్వం చిదహమేతేచ లోకాః చిదితి భావయ ॥**
**రాగం నీరాగతాం నీత్వా నిర్లేపో భవ సర్వదా । 49**

**ప్రతిపదార్థం :–** ఇహ = ఈ లోకమున, చిత్ = జ్ఞానమే, అస్తీతి = ఉన్నదని, ఇదమ్ = ఇది, చిన్మాత్రమ్ = జ్ఞానమాత్రమని, చిన్మయమేవ చ = ఇదంతా జ్ఞానమయమని, త్వమ్ = నీవు, చిత్ = చిత్తని, అహమ్ = నేను, చిత్ ఇతి= చిత్తని, ఏతే లోకాః = ఈ లోకములు, చిత్+ఇతి = చిత్తని, భావయ = భావింపుము. రాగమ్ = రాగమును, నీరాగతామ్= రాగశూన్యతను, నీత్వా = పొందించి, సర్వదా = ఎల్లపుడు, నిర్లేపః = సంగరహితుడవు, భవ = కమ్ము.

**తాత్పర్యం :–** ఇచ్చట ఉన్నదంతా జ్ఞానమని, ప్రపంచమంతా జ్ఞానమాత్రమని, జ్ఞానమే అలా కనబడుతున్నదని, నీవు, నేను చిత్తేనని ఈ లోకాలన్ని చిత్తేనని భావించుము. రాగమును రాగాభావంగా చేయుము. సర్వదా సంగరహితుడవై ఉండుము.

---

**అజ్ఞానజన్యకర్త్రాదికారకోత్పన్నకర్మణా ॥**
**శ్రుత్యుత్పన్నాత్మవిజ్ఞానప్రదీపో బాధ్యతే కథమ్ । 50**



**ప్రతిపదార్థం :–** అజ్ఞాన = అజ్ఞానము / అవిద్యనుండి. జన్య = పుట్టిన, కర్త్రాది = కర్త కర్మమొదలగు, కారక = కారకములనుండి / వలన, ఉత్పన్న = పుట్టిన, కర్మణా = కర్మచేత, శ్రుతి = వేదములనుండి, ఉత్పన్న = పుట్టిన, ఆత్మ = ఆత్మ సంబంధమయిన, విజ్ఞాన = జ్ఞానమనే, ప్రదీపః = దీపము, కథమ్ = ఎట్లు, బాధ్యతే = బాధింపబడును.

**తాత్పర్యం :–** అజ్ఞానం వలన పుట్టిన కర్త, కర్మ మొదలయిన కారకాల వలన పుట్టిన కర్మ ఉపనిషద్విజ్ఞానము వలన ఏర్పడిన జ్ఞానదీపాన్ని ఎలా ఆర్పగలదు?

---

**అనాత్మతాం పరిత్యజ్య నిర్వికారో జగత్స్థితౌ॥**
**ఏకనిష్ఠతయాంతస్థసంవిన్మాత్రపరో భవ! 51**

**ప్రతిపదార్థం :–** అనాత్మతామ్ = జడమయిన శరీరాత్మ భావమును వదలి, జగత్ = ప్రపంచంయొక్క, స్థితౌ = నిలుకడయందు, నిర్వికారః = వికార రహితుడవై, ఏకనిష్ఠతయా = తదేక నిష్ఠతో, అంతస్స్థ= లోపలనున్న / హృదయగుహలో నున్న, సంవిన్మాత్ర = జ్ఞానమాత్రమునందు, పరః = ఆసక్తుడవు, భవ = కమ్ము.

**తాత్పర్యం :–** దేహరూపమయిన అనాత్మనే ఆత్మగా భావింపవలదు. ప్రపంచ వ్యవహారమునందు లేదా ప్రపంచమునందుండటంలో వికారరహితుడవై ఏకనిష్ఠుడవై, నీలో గుహలో దాగి ఉన్న జ్ఞానమాత్రనిష్ఠతో నుండుము.

---

**ఘటాకాశమఠాకాశౌ మహాకాశే ప్రతిష్ఠితౌ॥**
**ఏవం మయి చిదాకాశే జీవేశౌ పరికల్పితౌ । 52**

**ప్రతిపదార్థం :–** ఘటాకాశ = ఘటంలోని ఖాళీరూపమయిన ఆకాశము, మఠాకాశా = మఠంలోని ఖాళీ రూపమయిన ఆకాశము, మహాకాశే = మూలాకాశము నందు, ప్రతిష్ఠితౌ = నిలిచియున్నవి, ఏవమ్ = ఈ విధంగానే, చిదాకాశే = జ్ఞానాకాశ మయిన, మయి = నాయందు, జీవేశౌ = జీవేశ్వరులు, పరికల్పితౌ = కల్పింపబడిరి.

**తాత్పర్యం :–** ఘటాకాశం గాని మఠాకాశంగాని మహాకాశంలో ఏర్పడినవే. అందుకు కారణము ఆకాశాన్ని తమలో నింపుకొన్న ఘటం, మఠం. అవి ఉపాధులు అట్లే జ్ఞానాకాశ స్వరూపుడనయిన నాయందు మాయ ఉపాధిగా ఈశ్వరుడు, అవిద్య

ఉపాధిగా జీవుడు కల్పింపబడినారు. తత్త్వం ఆకాశమే. అలాగే తత్త్వం శుద్ధ చైతన్యమే.

---

**యా చ ప్రాణాత్మనో మే మా తథాంతే చ తిరస్కృతా ॥**
**బ్రహ్మవాదిభిరుద్గీతా సా మాయేతి వివేకతః ।** **53**

**ప్రతిపదార్థం :–** ఆత్మనః = ఆత్మనయిన, మే = నాయొక్క, యా = ఏ, మా = అనిర్వచనీయ మిథ్యాశక్తి, ప్రాక్ చ = ముందున్ను, తథా = అలాగే, అంతే చ = చివరనున్ను, తిరస్కృతా = తిరస్కరింపబడినదో, సా = అది, వివేకతః = విచక్షణ వలన, మాయేతి = మాయ అని, బ్రహ్మవాదిభిః = బ్రహ్మవాదులచేత, ఉద్గీతా = చెప్పబడినది.

**తాత్పర్యం :–** ఆత్మరూపుడను నేను – ఈ ప్రపంచమంతా అనిర్వచనీయమయిన, నా, మిథ్యారూపమయిన శక్తినుండి వచ్చినది. అది సృష్టికి ముందు ప్రలయకాలమున అవ్యక్తముగానుండినది. అంటే తిరస్కృతంగా ఉన్నది. దానిని వివేకవంతులయిన బ్రహ్మవేత్తలు "మాయ" అన్నారు.

---

**మాయాతత్కార్యవిలయే నేశ్వరత్వం న జీవతా ॥**
**తతః శుద్ధశ్చిదేవాహం వ్యోమవన్నిరుపాధికః ।** **54**

**ప్రతిపదార్థం :–** మాయా = మాయయొక్క, తత్కార్య = మాయాకార్యమయిన ప్రపంచముయొక్క, లయే = ప్రలయ సమయమున, ఈశ్వరత్వమ్ = ఈశ్వరుడనుస్థితి, న = లేదు. జీవతా = జీవుడను స్థితి, న = లేదు. తతః = అందువలన, నిరుపాధికః = ఉపాధి (మాయ) రహితుడనయిన, అహమ్ = నేను, వ్యోమవత్ = ఆకాశమువలె, శుద్ధః = కేవలమయిన, చిత్ – ఏవ = జ్ఞానమునే.

**తాత్పర్యం :–** సృష్టియొక్క ఆద్యంతములందున్న ప్రలయస్థితిలో లేదా సుషుప్తి స్థితిలో మాయ మాయాకార్యమయిన అవిద్యా సంసారాదులు ఉండవు. ఘటమఠాలు లేనపుడు కేవల ఆకాశమే ఉన్నట్లు, మాయాది ఉపాధులు లేనపుడు నేను శుద్ధచైతన్యంగానే ఉంటాను. కనుక ఆ స్థితిలో ఈశ్వరుడూ లేడు. జీవుడూ లేడు. అంటే అట్టి ప్రత్యేకతలుండవు. రాజ్యమే లేనపుడు రాజూ లేడు. మంత్రీ లేడు.



**జీవేశ్వరాదిరూపేణ చేతనాచేతనాత్మకమ్ ॥**
**ఈక్షణాదిప్రవేశాంతా సృష్టిరీశేన కల్పితా ।**
**జాగ్రదాదివిమోక్షాంతః సంసారో జీవకల్పితః॥** **55**

**ప్రతిపదార్థం :–** ఈక్షణాది = సృష్టి చేద్దామని చూడటం (సంకల్పం / కామం) మొదలుగా, ప్రవేశాంతా = జీవుడుగా శరీరములో ప్రవేశించుదాక ఉన్న, సృష్టిః = ఈ సృష్టి, జీవేశ్వరాది = జీవుడు, ఈశ్వరుడు, ప్రకృతి మొదలగు, రూపేణ = రూపముచేత, చేతన = జ్ఞానముగల, అచేతన = జడమైన, ఆత్మకమ్ = స్వరూపము గలుగునట్లుగా, ఈశేన = ఈశ్వరునిచేత, కల్పితా = కల్పింపబడినది. జాగ్రదాది = జాగరణ మొదలు, విమోక్షాంతః = మోక్షముదాక, సంసారః = సంసారము, జీవకల్పితః = జీవునిచేత కల్పింపబడినది.

**తాత్పర్యం :–** సృష్టి సంకల్పం మొదలు (తదైక్షత) దేహంలో జీవుడుగా (అనేన జీవేనాత్మనా) ప్రవేశించువరకు, ఈ సృష్టి ఈశ్వరకల్పితము. ఇందులో జీవుడు ఈశ్వరుడు మొదలగు చేతనాంశములు. ప్రకృతి అను అచేతనాంశము ఇమిడి యున్నవి. జాగరణమునుంచి మోక్షందాకా సంసారమును జీవుడు కల్పించాడు.

---

**త్రిణాచికాదియోగాంతా ఈశ్వరభ్రాంతిమాశ్రితాః ।**
**లోకాయతాదిసాంఖ్యాంతా జీవవిభ్రాంతిమాశ్రితాః॥** **56**

**ప్రతిపదార్థం :–** త్రిణాచికాది = త్రిణాచికేతః అని కఠోపనిషత్తులో చెప్పిన అగ్ని – ఉపాసన నుంచి, యోగాంతాః = యోగ సాధనవరకున్న విధానాలు, ఈశ్వరభ్రాంతిమ్ = అగ్ని మొదలగు వారే ఈశ్వరులన్న భ్రాంతిని, ఆశ్రితాః = ఆశ్రయించినవి. లోకాయతాది = లోకాయతులు మొదలు, సాంఖ్యాంతాః = సాంఖ్యులదాకా, ఉన్న విధానాలు, జీవవిభ్రాంతిమ్ = జీవభ్రాంతిని, ఆశ్రితాః = ఆశ్రయించినవి.

**తాత్పర్యం :–** అగ్ని సూర్యాది ఉపాసనలనుంచి ఈశ్వర ప్రణిధాన రూపమయిన యోగశాస్త్రం వరకు ఆయాదేవతలను ఈశ్వరులుగా భ్రాంతిపడి తయారయిన విధానాలే. లోకాయతులనుంచి సాంఖ్యులవరకు ఉన్న విధానాలు చైతన్యమును జీవుడని భ్రమించి చెప్పిన విధానాలు.

**తస్మాన్ముముక్షుభిర్నైవ మతిః జీవేశవాదయోః ।**

**కార్యా కిం తు బ్రహ్మతత్త్వం నిశ్చలేన విచార్యతామ్॥ 57**

**ప్రతిపదార్థం :-** తస్మాత్ = అందువలన, ముముక్షుభిః = మోక్షకాములచేత, జీవేశ = జీవ - ఈశ్వరులకు సంబంధించిన, వాదయోః = వాదముల యందు, మతిః = బుద్ధి, నైవ కార్యా = చేయదగదు. కింతు = కాని, నిశ్చలేన = అచంచల మనస్సుతో , బ్రహ్మతత్త్వమ్ = బ్రహ్మతత్త్వము, విచార్యతామ్ = విచారింపబడుగాక!

**తాత్పర్యం :-** మోక్షకాములు సాంకేతికమయిన యీ జీవేశ్వర వాదముల మీద మనస్సు పెట్టవలదు. ఇవి ఏవిధంగా ఏర్పడినప్పటికి మిధ్య అయిన మాయ, అవిద్యవలన వచ్చిన ఔపాధిక భేదములే కాని వాస్తవము కావు. వాస్తవమయినది వీటి అన్నింటికి మూలమయిన అధిష్ఠానమయిన బ్రహ్మతత్త్వము దానిని ఆలోచించవలసినది.

---

**అద్వితీయబ్రహ్మతత్త్వం న జానంతి యథా తథా ।**

**భ్రాంతా ఏవాఖిలాస్తేషాం క్వ ముక్తిః క్వేహ వా సుఖమ్॥ 58**

**ప్రతిపదార్థం :-** యథాయథా = ఎంతగా, అద్వితీయ = అద్వితీయమైన, బ్రహ్మతత్త్వ = బ్రహ్మతత్త్వమును, న జానంతి = ఎరుగరో, అఖిలాః = వారందరు, భ్రాంతా ఏవ = భ్రాంతిపడిన వారే! తేషామ్ = వారికి, ముక్తిః = మోక్షం, క్వ = ఎక్కడ? ఇహ - ఈ లోకంలోనయినా, సుఖమ్ = నిశ్చితమయిన ఆనందము, క్వ = ఎక్కడ?

**తాత్పర్యం :-** అద్వితీయమైన బ్రహ్మతత్త్వమును తెలిసికొనకుండా ఎంతగా దూరంగా ఉంటారో వారందరూ అంతగా భ్రాంతి పడినవారే కనుక వారికి ముక్తి ఎక్కడ? సుఖము ఎక్కడ?

**ఉత్తమాధమభావశ్చేత్ తేషాం స్యాదస్తి తేన కిమ్?**

**స్వప్నస్థరాజ్యభిక్షాభ్యాం ప్రబుద్ధః స్పృశ్యతే ఖలు॥ 59**

**ప్రతిపదార్థం :-** తేషామ్ = జీవేశ్వరాదులకు, ఉత్తమాధమభావః = ఉత్తముడు, అధముడు అన్న తేడా, చేత్ = ఉంటే, తేన= ఆ భేదముతో, కిమ్ = ఏమి హాని జరుగును? స్వప్నస్థ = స్వప్నమునందున్న, రాజ్య = రాచరికము, భిక్షాభ్యామ్ =



పేదరికములచేత, ప్రబుద్ధః = మేల్కొన్నవాడు, ఖలు స్పృశ్యతే = తాకబడుట లేదు.

**తాత్పర్యం :-** జీవేశ్వరులనేది ఒక కల్పన. మాయవలన సంసారమువలన వ్యవహారంలో ఏర్పడిన మిథ్యావ్యవస్థ. స్వప్నవ్యవస్థ వంటిది. స్వప్నంలో ఒక వ్యక్తి రాజయినా పేద అయినా మేల్కొన్నదశలో ఆ మంచి చెడ్డలు మిగలవు. అలాగే జ్ఞానదశలో జీవేశ్వర భేదాలు పనిచేయవు. అంతా శుద్ధచైతన్యమే.

---

**అజ్ఞానే బుద్ధివిలయే నిద్రా సా భణ్యతే బుధైః ।**

**విలీనాజ్ఞానతత్కార్యే మయి నిద్రా కథం భవేత్॥ 60**

**ప్రతిపదార్థం :-** అజ్ఞానే = అజ్ఞానమునందు, బుద్ధి = బుద్ధియొక్క, విలయే = లయము జరుగగా, సా = ఆ దశ, నిద్రా = నిద్ర అని, బుధైః = పండితులచేత, భణ్యతే = చెప్పబడును. విలీన = కరిగి పోయిన, అజ్ఞాన = అజ్ఞానము, తత్కార్యే = అజ్ఞానకార్యమయిన ప్రపంచముగల, మయి = నాయందు, నిద్రా = నిద్ర, కథమ్ = ఎట్లు? భవేత్ = కలుగును.

**తాత్పర్యం :-** అజ్ఞానంయొక్క అంశయే మనబుద్ధి. అది నిద్రలో (సుషుప్తి) తన మూలకారణమయిన అజ్ఞానంలో కలిసిపోతుంది. అపుడు ఆ అచేతనస్థితిని నిద్ర అంటారు. కాని జ్ఞానం వలన అజ్ఞానం నశిస్తుంది. అజ్ఞాన ఫలితాలయిన సంసారం గూడా మిథ్య అయిపోతుంది. అటువంటి నాయందు నిద్ర ఎలా ఏర్పడుతుంది.

---

**బుద్ధేః పూర్ణవికాసోఽయం జాగరః పరికీర్త్యతే।**

**వికారాదివిహీనత్వాత్ జాగరో మే న విద్యతే॥ 61**

**ప్రతిపదార్థం :-** బుద్ధేః = బుద్ధియొక్క, పూర్ణ = సమగ్రమయిన, వికాసః = వికాసరూపమయిన, అయమ్ = ఈ స్థితి, జాగరః = జాగరణమని, పరికీర్త్యతే = చెప్పబడును. వికారాది = వికారములు మొదలయిన వానితో, విహీనత్వాత్ = లేనివాడయినందున, మే = నాకు, జాగరః = జాగరణ, న విద్యతే = లేదు.

**తాత్పర్యం :-** బుద్ధి సంపూర్ణ వికాసంలో ఉండటం జాగరం అంటారు. నేను నిర్వికారుడను కనుక, నాకు జాగరణం అనగా వ్యావహారిక దశ గూడా లేదు.

**సూక్ష్మనాడిషు సంచారో బుద్ధేః స్వప్నః ప్రజాయతే ।**

**సంచారధర్మరహితే మయి స్వప్నో న విద్యతే॥ 62**

**ప్రతిపదార్థం :–** సూక్ష్మనాడిషు = పురీతత్ వంటి సూక్ష్మనాడులయందు, బుద్ధేః = బుద్ధియొక్క, సంచారః = నడక, స్వప్నః = 'కల', ప్రజాయతే = పుట్టును. సంచారధర్మ = సంచరణ స్వభావములచేత, రహితే = శూన్యుడనయిన, మయి = నాయందు, స్వప్నః = కల, న విద్యతే = ఉండదు.

**తాత్పర్యం :–** బుద్ధి సూక్ష్మనాడులలో సంచరించునపుడు మనకు కలలు కలుగును. అవన్ని బుద్ధియొక్క వికారాలు. కాని ఆత్మకు – సర్వవ్యాపి కనుక – అట్టి సంచారధర్మాలు వికారాలు లేవు. కనుక నాయందు అనగా ఆత్మయందు కలలు మొ॥ ఉండవు.

---

**సుషుప్తికాలే సకలే విలీనే తమసావృతే ।**

**స్వరూపం మహదానందం భుంక్తే దృశ్యవివర్జితః॥ 63**

**ప్రతిపదార్థం :–** సకలే = సమస్త బాహ్యాంతర ప్రపంచము, విలీనే = లీనముకాగా, తమసా = అజ్ఞానాంధకారముచేత, ఆవృతే = ఆవరింపబడిన, సుషుప్తికాలే = గాఢ నిద్రాసమయమున, దృశ్య = దృశ్యమయిన పదార్థముచేత, వివర్జితః = శూన్యుడై, మహత్ = గొప్పదయిన, ఆనందమ్ = ఆనందమయిన, స్వరూపమ్ = నిజరూపమును, భుంక్తే = అనుభవించును. (జీవుడు)

**తాత్పర్యం :–** సుషుప్తిలో సమస్తము కరగిపోతుంది. అంతా అజ్ఞానమే. ఏ దృశ్యమూ ఉండదు. అపుడు జీవుడు మహానందమయిన తన రూపమును తనే అనుభవించును.

**అవిశేషేణ సర్వం తు యః పశ్యతి చిదన్వయాత్ ।**

**స ఏవ సాక్షాద్విజ్ఞానీ స శివః స హరిః విధిః॥ 64**

**ప్రతిపదార్థం :–** చిదన్వయాత్ = జ్ఞానముయొక్క కలయిక వలన, యః = ఎవడు, సర్వంతు = అంతటిని, అవిశేషేణ = జ్ఞానసామాన్యముగా, పశ్యతి = చూచునో, స ఏవ = వాడే, సాక్షాత్ = ప్రత్యక్షముగా, విజ్ఞానీ = జ్ఞానము గలవాడు, సః = వాడే, శివః = శివుడు, సః = వాడే, హరిః = హరి, సః = వాడే, విధిః = బ్రహ్మ అగును.



**తాత్పర్యం :–** జ్ఞాన ప్రభావంతో సర్వత్ర సమానంగా వ్యాపించిన జ్ఞానమాత్రమునే చూచువాడు అపరోక్ష జ్ఞాని. వాడే శివుడు. వాడే హరి. వాడే విధి. బ్రహ్మజ్ఞానం గలవాడు బ్రహ్మమే. జ్ఞాని ఆత్మయే గదా!

---

**దీర్ఘస్వప్నమిదం యత్తద్దీర్ఘం వా చిత్రవిభ్రమమ్ ।**

**దీర్ఘం వాపి మనోరాజ్యం సంసారం దుఃఖసాగరమ్ ॥**

**సుప్తేరుత్థాయ సుప్త్యంతం బ్రహ్మైకం ప్రవిచింత్యతామ్॥ 65**

**ప్రతిపదార్థం :–** దుఃఖసాగరమ్ = శోక సముద్రమయిన, ఇదమ్ = ఈ, సంసారం = సంసారము, దీర్ఘస్వప్నం = పొడుగాటి స్వప్నము. తత్ = అది, దీర్ఘమ్ = పొడవైన, చిత్త విభ్రమమ్వా = మనస్సుయొక్క మార్పు, దీర్ఘ = పొడవయిన, మనోరాజ్యం వాపి = మానసిక రాజ్యమయినా కావచ్చును. అందువలన, సుప్తేః = నిద్రనుండి, ఉత్థాయ = లేచి. సుప్త్యంతమ్ = మరల నిద్రపోయేవరకు, బ్రహ్మ = బ్రహ్మము, ఏకమ్ = ఒక్కటే, చింత్యతామ్ = విచారణ చేయబడుగాక!

**తాత్పర్యం :–** దుఃఖ సముద్రమయిన యీ సంసారము ఒక దీర్ఘమయిన మహాస్వప్నము. అతి దీర్ఘమయిన మనోవిభ్రమం అనగా పిచ్చి. చాలా పొడవయిన మానసిక రాజ్యము. కనుక నిద్రనుంచి మరల నిద్రదాక బ్రహ్మమొక్కటి విచారణ చేయదగినది.

---

**ఆరోపితస్య జగతః ప్రవిలాపనేన**

**చిత్తం మదాత్మకతయా పరికల్పితం నః ।**

**శత్రూన్ నిహత్య గురుషట్కగణాన్నిపాతాత్**

**గంధద్విపో భవతి కేవలమద్వితీయః॥ 66**

**ప్రతిపదార్థం :–** ఆరోపితస్య = అధ్యాస చేయబడిన, జగతః = జగత్తుయొక్క, ప్రవిలాపనేన = కరగించుటచేత, నః = మనయొక్క, చిత్తమ్ = మనస్సు, మదాత్మకతయా = నా రూపంగా, పరికల్పితమ్ = కల్పింపబడినదగును. గురు = గురువయిన, షట్క శమదమాది = షడ్గుణములయొక్క, గణాత్ = సమూహమువలన,

శత్రూన్ = కామక్రోధాది శత్రువులను, నిహత్య = చంపి, నిపాతాత్ = శత్రు పతనంవలన, గంధద్విపః = గంధగజం వలె, కేవలమ్ = కేవలముగా, అద్వితీయః = ద్వితీయ రహితుడై, భవతి = ఉండును. (జీవుడు లేదా చిత్తము)

**తాత్పర్యం :-** భ్రాంతివలన బ్రహ్మమునందు ఆరోపితమయిన ప్రపంచమును తత్త్వదృష్ట్యా వేదాంతరీత్యా మిథ్య అని గ్రహించి మన మనస్సు నా రూపంగా అనగా చైతన్యరూపంగా మారుతుంది. అట్టి చిత్తము గల జీవుడు శమదమాది షడ్గుణములతో కామక్రోధాది - ఆరుగురు శత్రవులను చంపి, అందువలన మత్తగజంలాగా అద్వితీయంగా, కేవలంగా ఉంటాడు.

---

**అద్యాస్తమేతు వపురాశశితారమాస్తాం**
**కస్తావతాపి మమ చిద్వపుషో విశేషః।**
**కుంభే వినశ్యతి చిరం సమవస్థితే వా**
**కుంభాంబరస్య న హి కోఽపి విశేషలేశః॥ 67**

**ప్రతిపదార్థం :-** వపుః = ఈ శరీరము, అద్య = నేడే, అస్తం = అస్తమయమును, ఏతు = పొందుగాక!, ఆశశితారమ్ = ఆచంద్ర తారకంగా, ఆస్తామ్= శాశ్వతంగా ఉందుగాక!, తావతాపి = అంతమాత్రం చేత నయినా, చిద్వపుషః = జ్ఞానస్వరూపుడ నయిన, మమ = నాకు, విశేషః = తేడా, కః = ఏది? కుంభే = కడవ, వినశ్యతి = నశించునదయినా, చిరమ్ = చాలాకాలం, సమవస్థితే వా = ఉందినను, కుంభ = కడవయందలి, అంబరస్య = ఆకాశమునకు, విశేషలేశః = కాస్త భేదమయినా, కోఽపి = ఏదయినా, న హి = లేదు గదా!

**తాత్పర్యం :-** ఈ శరీరం ఇవ్వాళనే పోనీ, లేక ఆచంద్ర తారార్కం శాశ్వతంగా ఉండనీ! జ్ఞానస్వరూపుడనయిన నాకు దానివలన వచ్చిన భేదము లేదు. కడవ పగిలిపోయినా శాశ్వతంగా మిగిలి ఉన్నా కడవలోని ఆకాశమునకు వచ్చే తేడా ఏమీ ఉండదు.

---

**అహి నిర్ల్వయినీ సర్పనిర్మోకో జీవవర్జితః ।**
**వల్మీకే పతితః తిష్ఠేత్ తం సర్పో నాభిమన్యతే॥ 68**

22



**ప్రతిపదార్థం :-** అహి = పాముయొక్క, నిర్ల్వయినీ = కవచము అనగా, జీవవర్జితః = ప్రాణి శూన్యమయిన, సర్పనిర్మోకః = పాము కుబుసము, వల్మీక = పుట్టయందు, పతితః = పడినదై, తిష్ఠేత్ = ఉండును. తం = ఆ కుబుసమును, సర్పః = పాము, నాభిమన్యతే = అభిమానించదు.

**తాత్పర్యం :-** తాను విడిచిన కుబుసము పుట్టలో నిర్జీవంగా పడి ఉన్నా సర్పము తన కుబుసము మీద అభిమానపడదు. వదలి రావటానికి జాలిపడదు. అలాగే యోగి తన శరీరంమీద అనాసక్తిగా ఉంటాడు.

---

**ఏవం స్థూలం చ సూక్ష్మం చ శరీరం నాభిమన్యతే।**
**ప్రత్యగ్ జ్ఞానశిఖిధ్వస్తే మిథ్యాజ్ఞానే సహేతుకే।**
**నేతి నేతీతి రూపత్వాదశరీరో భవత్యయమ్॥ 69**

**ప్రతిపదార్థం :-** ఏవమ్ = ఈవిధముగా, స్థూలం చ = స్థూలమయినదియు, సూక్ష్మం చ = సూక్ష్మమయినదియు అగు, శరీరమ్ = దేహమును, నాభిమన్యతే = జ్ఞాని అభిమానించదు. సహేతుకే = హేతువయిన అజ్ఞానంతో సహా, మిథ్యా జ్ఞానే = నకిలీ జ్ఞానం అనగా వ్యవహారజ్ఞానము, ప్రత్యక్ = ప్రత్యగాత్మయొక్క, జ్ఞాన = జ్ఞానమను, శిఖి = అగ్నిచేత, ధ్వస్తే = ధ్వంసము చేయబడగా, నేతి నేతి = "ఇదికాదు, ఇది కాదు". అని, ఇతి = అను, రూపత్వాత్ = స్వరూపంగల వాడగుటవలన, అయమ్ = ఈ జీవుడు, అశరీరః = శరీర రహితుడుగా, భవతి = అగును.

**తాత్పర్యం :-** కనుక జ్ఞాని అయిన జీవుడు తన స్థూల, సూక్ష్మ శరీరములను అభిమానించదు. కారణమయిన అజ్ఞానంతోసహా మిథ్యా జ్ఞానరూపమయిన సంసారం ప్రత్యగాత్మ జ్ఞానంతో దగ్ధమవుతుంది. దేహేంద్రియాదులు తాత్త్వికంగా మిథ్య అని చైతన్యం వీనికతీతమని తెలుస్తుంది. అందువలన జ్ఞాని శరీరాభిమాన రహితుడగును.

---

**శాస్త్రేణ నశ్యేత్ పరమార్థదృష్టిః**
**కార్యక్షమం నశ్యతి చాపరోక్షాత్ ।**

**ప్రారబ్ధనాశాత్ ప్రతిభాననాశ -**
**ఏవం త్రిధా నశ్యతి చాత్మమాయా॥ 70**

**ప్రతిపదార్థం :–** శాస్త్రేణ = వేదాంతశాస్త్రముచేత, పరమార్థదృష్టిః = మాయా, సంసారములే పరమార్థమను దృష్టి, నశ్యతి = నశించును. ఆపరోక్ష్యాత్ = నేనే బ్రహ్మమును అన్న విజ్ఞానం వలన, కార్య = వ్యవహారమునకు, క్షమమ్ = తగిన అజ్ఞానము, నశ్యతి = నశించును. ప్రారబ్ధనాశాత్ = ప్రారబ్ధం నశించడంవలన, ప్రతిభాన = దగ్ధపట న్యాయంగా మాయ కనబడటంయొక్క, నాశః = నాశము జరుగును, ఏవమ్ = ఇలాగున, ఆత్మమాయా = తన మాయ / అవిద్య, త్రిధా = మూడు విధములుగా, నశ్యతి = నశించును.

**తాత్పర్యం :–** శరీరత్రయ కారణమయిన మాయ ఉండగా తన శరీరాభిమానం ఎలా పోతుంది? – అని ప్రశ్న. దీనికి సమాధానం ఇది. శాస్త్ర జన్యమయిన జ్ఞాన విజ్ఞాన తత్త్వజ్ఞానాలవలన బ్రహ్మభిన్నముగా మాయ లేదని, అదే సమయంలో మాయాకార్యమయిన ఆగామి సంచితకర్మలు సంస్కార సహితంగా క్షీణిస్తాయి. అపుడు అతనికి విదేహముక్తితో పూర్తిగా మాయ నశిస్తుంది. కనుక, మాయ మూడు విధాలుగా నశిస్తుంది.

1. మాయయే నిజము. ప్రపంచమే నిజము, దేహమే సత్యము అన్న పరమమయిన అర్థదృష్టి / పరమార్థ దృష్టి నశించును. ఇది ఒక మాయానాశము.

2. దానివలన వ్యవహారావసరమయిన కర్మలు ఆగామి సంచితములు నశించును. ఇది మరొక మాయానాశము. – జీవన్ముక్తి వలన మాయ దగ్ధపటంగా శూన్యంగా ఉంటుంది.

3. ప్రారబ్ధనాశం అనుభవంతో జరుగుతుంది. అపుడు మాయా సంపూర్ణనాశము. శూన్యంగా గూడా కనబడదు. ఇది విదేహముక్తి. (మరణముక్తి.)

---

**బ్రహ్మత్వే యోజితే స్వస్మిన్ జీవభావో న గచ్ఛతి।**
**అద్వైతే బోధితే తత్త్వే వాసనా వినివర్తతే ॥**
**ఆరబ్ధాంతే దేహహానిః మాయేత్థం క్షీయతేఽఖిలా । 71**



**ప్రతిపదార్థం :–** స్వస్మిన్ = తనయందు / ఆత్మయందు, బ్రహ్మత్వే = బ్రహ్మ భావన, యోజితే = కలుపబడగా, జీవభావః = జీవాత్మభావన, నగచ్ఛతి = పోదు, అద్వైతే = అద్వైతము, తత్త్వే = తత్త్వముగా, బోధితే = బోధింపబడగా, వాసనా = అజ్ఞానవాసన, వినివర్తతే = తొలగును. ఆరబ్ధాంతే = ప్రారబ్ధం పూర్తయిన తర్వాత, దేహహానిః = దేహనాశము. ఇత్థం = ఇలా, అఖిలా = సమస్తమయిన, మాయా = మాయ, క్షీయతే = నశించును.

**తాత్పర్యం :–** జీవుని బ్రహ్మగా ఉపాసన చేసేవారు జీవునియందు బ్రహ్మభావనను విధించినట్లు చెప్తారు. 'మనోబ్రహ్మ' అన్నట్లు ప్రతీకోపాసనగా భావిస్తారు. అట్టి ఉపాసనలవలన జీవత్వం పోదు. లేదా కేవలం బ్రహ్మ భావన చేసినంత మాత్రాన జీవభావం పోదు. జీవుడు బ్రహ్మము రెండు కాదు. ఒక్కటే – అన్ని అద్వైత భావన వస్తేనే జీవభావన పోతుంది. బ్రహ్మాత్మైక్య భావన కలుగుతుంది. ప్రారబ్ధావసానమున విదేహముక్తితో మాయానాశం పూర్తవుతుంది.

---

**అస్తీత్యుక్తే జగత్సర్వం సద్రసం బ్రహ్మ తద్భవేత్ ॥**
**భాతీత్యుక్తే జగత్సర్వం భానం బ్రహ్మైవ కేవలమ్ । 72**

**ప్రతిపదార్థం :–** అస్తి = ఉన్నది, ఇతి = అని, ఉక్తే = అంటే, సర్వమ్ = సమస్తమయిన, జగత్ = ఈ ప్రపంచము, సద్రసం = సత్తుసారముగాగ గలదై, తత్ = ఆ సత్తా రూపమయిన, బ్రహ్మ = బ్రహ్మమే, భవేత్ = అగును. 'భాతి' = తెలుస్తున్నది, ఇతి = అని, ఉక్తే = అంటే, సర్వమ్ = సమస్తమయిన, జగత్ = ప్రపంచము, భానమ్ = జ్ఞాన / ప్రకాశరూపమై, కేవలమ్ = కేవలమయిన, బ్రహ్మైవ = బ్రహ్మమే అగును.

**తాత్పర్యం :–** అస్తి భాతి ప్రియం – అని మూడు బ్రహ్మ స్వరూపాలు. మనకు కనబడే వస్తువులన్ని బ్రహ్మ వివర్తరూపమయిన వికారాలే. అంటే బ్రహ్మము మన అజ్ఞానం వలన సంసారంగా కనబడుతున్నది. రజ్జువు సర్పంలాగా కనబడుతున్నది. అయినా రజ్జువు మారదు. సర్పం వాస్తవంగా లేదు. కనుక అచ్చట సర్పమున్నది అన్న భ్రాంతి కలిగినపుడు 'ఉన్నది' అన్న పదం చెప్పిన 'ఉనికి' (సత్త) రజ్జువుకు చెందుతుంది. ఇది వాస్తవము. సకలపదార్థములు "పామువలె" భ్రాంతులయినపుడు వాటి "ఉనికి" వాస్తవమయిన బ్రహ్మమునకే చెందుతుంది. అలాగే ఏదయినా

'తెలుస్తున్నది' అంటే ఆ 'తెలివి' బ్రహ్మమే. కనుక ప్రపంచములోని 'అస్తి, భాతి' అన్నవి రెండు అనగా 'సత్త, జ్ఞానము' బ్రహ్మరూపమే.

---

**మరుభూమౌ జలం సర్వం మరుభూమాత్రమేవ తత్।**
**జగత్త్రయమిదం సర్వం చిన్మాత్రం స్వవిచారతః॥ 73**

**ప్రతిపదార్థం :–** మరుభూమౌ = ఎడారియందున్న, తత్ = ఆ, సర్వమ్ = సమస్తమయిన, జలమ్ = నీరులాగా కనబడే నీరు, మరుభూమాత్రమేవ = కేవలం ఆ ఎడారి నేలమాత్రమే, ఇదమ్ = ఈ, సర్వం = సమస్తమయిన, జగత్త్రయమ్ = లోకత్రయము, స్వవిచారతః = ఆత్మవిచారణరీత్యా, చిన్మాత్రమ్ = కేవల జ్ఞానరూపమే.

**తాత్పర్యం :–** ఎడారిలో సూర్యకిరణాలకు బాగా వేడెక్కిన ఇసుక సెగలు పొగలు కక్కుతుంది. ఆ సెగలు దూరానికి నీటి తరంగాలుగా కనబడుతుంది. కనుక ఎడారిలో కనబడే యీ నీరు ఎడారినేల మాత్రమే. అక్కడ నీరున్నది అంటే నీటికధిష్ఠానమయిన ఎడారియే ఉన్నది. అలాగే బ్రహ్మమే మాయవలన ప్రపంచంగా కనబడుతున్నది. కనుక ప్రపంచమంటే బ్రహ్మమే తప్ప వేరుగా ఏమీ లేదు.

---

**అజ్ఞానమేవ న కుతో జగతః ప్రసంగో**
**జీవేశదేశికవికల్పకథాతిదూరే ।**
**ఏకాంతకేవలచిదేకరసస్వభావే**
**బ్రహ్మైవ కేవలమహం పరిపూర్ణమస్మి॥ 74**

**ప్రతిపదార్థం :–** అజ్ఞానమేవ = అజ్ఞానమే, న = లేదు, జగతః= ప్రపంచముయొక్క ప్రసంగః = ప్రసంగము, కుతః = ఎక్కడిది?, జీవ = జీవులు, ఈశ = ఈశ్వరులు, దేశిక = గురువులు అనెడు, వికల్పకథా = వికల్పచరిత్రకు, అతిదూరే = మిక్కిలి దూరమయిన, ఏకాంత = ఏకమయిన, కేవల = అద్వితీయమైన, 'చిత్' = జ్ఞానమే, ఏకరస = ఏకరూపమయిన, స్వభావే = ఆత్మభావమునందున్న, అహమ్ = నేను, పరిపూర్ణమ్ = పూర్ణము, కేవలమ్ = కేవలము అయిన, బ్రహ్మ = బ్రహ్మమును, అస్మి = అగుచున్నాను.





**తాత్పర్యం :–** నాకు అజ్ఞానము లేదు. దానివలన వచ్చే ప్రపంచం నాకెలా ఉంటుంది? జీవేశ్వరులు గురుశిష్యులు మొదలయిన వికల్ప ప్రస్తావనలకు దూరంగా ఏకాంతము అద్వితీయమూ అయిన జ్ఞానమాత్రరూపమయిన ఆత్మభావమునందున్న నేను అద్వితీయ పరిపూర్ణ బ్రహ్మమును.

---

**బోధచంద్రమసి పూర్ణవిగ్రహే**
**మోహరాహుముషితాత్మతేజసి ।**
**స్నానదానయజనాదికాః క్రియా**
**మోచనావధి వృథైవ తిష్ఠతే॥ 75**

**ప్రతిపదార్థం :–** పూర్ణవిగ్రహే = పూర్ణాకారమయిన, బోధచంద్రమసి = జ్ఞానచంద్రుడు, మోహ = అజ్ఞానమనే, రాహు = రాహువుచేత, ముషిత = అపహరింపబడిన, ఆత్మతేజసి = తన తేజస్సు / ఆత్మ ప్రకాశముగలవాడగుచుండగా, స్నాన = తీర్థస్నానము, దాన = దానము, యజన = యజ్ఞము, ఆదికా = మొదలుగా గల, క్రియా = క్రియ, మోచనావధి = మోక్ష పర్యంతము, వృథైవ = వ్యర్థముగానే, తిష్ఠతే = ఉండును / నిరీక్షించును.

**తాత్పర్యం :–** పూర్ణచంద్రునివంటి జ్ఞానమును అజ్ఞానమనే రాహువు పట్టివేయగా ఆత్మతేజస్సు పోయి అజ్ఞానాంధకారము అలుముకొన్నది. ఆ సందర్భంలో మనం చేసే తీర్థస్నాన, దాన, యాగాది క్రియలు గ్రహణ మోక్షందాకా ఎదురు చూస్తున్నట్లు మన కర్మకాండలన్ని జ్ఞానగ్రహణ విమోచనందాకా వృథాగా ఎదురుచూస్తూ ఉంటాయి. మనం చేసే స్నానదానాదులవలన గ్రహణం పోదు. గ్రహణమోక్షం అయ్యేదాకా అవి ఎదురుచూస్తూ సాగుతుంటాయి. అలాగే మన కర్మాదులు గూడా జ్ఞానగ్రహణాన్ని నివారించలేవు. అజ్ఞాన నాశందాకా అలా వ్యర్థంగా ఎదురుచూస్తుంటాయి.

---

**సలిలే సైంధవం యద్వత్ సామ్యం భజతి యోగతః ।**
**తథాత్మమనసోరైక్యం సమాధిరితి కథ్యతే॥ 76**

**ప్రతిపదార్థం :–** సలిలే = జలమునందు, సైంధవమ్ = ఉప్పు, యోగతః = కలవటంద్వారా, యద్వత్ = ఎలా, సామ్యమ్ = నీటితో సమానత్వమును, భజతి = పొందునో, తథా = అలాగున, ఆత్మమనసోః = ఆత్మ మనస్సులయొక్క, ఐక్యమ్ = కలయిక, సమాధిః = సమాధి అని, కథ్యతే = చెప్పబడును.

**తాత్పర్యం :–** నీటిలో ఉప్పు కరిగి ఐక్యం పొందినట్లు ఆత్మమనస్సులు కలవటం సమాధి అని అందురు.

---

**దుర్లభో విషయత్యాగో దుర్లభం తత్త్వదర్శనమ్ ।**
**దుర్లభా సహజావస్థా సద్గురోః కరుణాం వినా॥ 77**

**ప్రతిపదార్థం :–** సద్గురోః = సద్గురువుయొక్క, కరుణామ్ = దయను, వినా = లేకుండా, విషయ = విషయములయొక్క, త్యాగః = వదలటం, దుర్లభః = దుర్లభము, తత్త్వ = తత్త్వమును, దర్శనమ్ = దర్శించుట, దుర్లభమ్ = దుర్లభము, సహజావస్థా = యోగసమాధి, దుర్లభా = దుర్లభము.

**తాత్పర్యం :–** జ్ఞాని, యోగి, అయిన గురువు కరుణ లేకుండా విషయ పరిత్యాగం గాని, తత్త్వదర్శనం గాని, సహజసమాధిగాని అసాధ్యము.

---

**ఉత్పన్నశక్తిబోధస్య త్యక్తనిశ్శేషకర్మణః ।**
**యోగినః సహజావస్థా స్వయమేవ ప్రకాశతే॥ 78**

**ప్రతిపదార్థం :–** ఉత్పన్న = పుట్టిన, శక్తి = కుండలినీశక్తియొక్క, బోధస్య = మేల్కొలుపుగలవాడును, త్యక్త = వదలబడిన, నిశ్శేష = సమస్తమయిన, కర్మణః = కర్మలుగలవాడును అగు, యోగినః = యోగికి, సహజావస్థా = సహజావస్థ, స్వయమేవ = స్వయంగానే, ప్రకాశతే = స్ఫురించును. ఒనగూడును.

**తాత్పర్యం :–** కుండలినీశక్తి జ్ఞానశక్తి. ఆమె మేల్కొన్న తర్వాత, సర్వకర్మవైరాగ్యం కలిగి కర్మసన్న్యాసం చేసిన యోగికి సహజావస్థ సహజంగానే ఏర్పడుతుంది.

---



**రసస్య మనసశ్చైవ చంచలత్వం స్వభావతః**
**రసో బద్ధో మనో బద్ధం కిం న సిధ్యతి భూతలే॥ 79**

**ప్రతిపదార్థం :–** రసస్య = రసమునకు అనగా వీర్యమునకు పాదరసమునకు, మనసశ్చైవ = మనస్సుకు, చంచలత్వమ్ = చాంచల్యము, స్వభావతః = స్వభావసిద్ధము, రసః = రసము, బద్ధః = నిలబడినచో, మనః = మనస్సు, బద్ధం = నిలబడును. అలా అయితే, భూతలే = భూలోకమునందు, కిమ్ = ఏది, న సిధ్యతి = సిద్ధించదు?

**తాత్పర్యం :–** రసం వలన వీర్యం స్థిరమవుతుంది. వీర్యం స్థిరమయితే మనస్సు స్థిరమవుతుంది. వీర్యం ఊర్ధ్వగామి అయితే మనస్సు విషయత్యాగం చేసి ఊర్ధ్వముఖమవుతుంది. అపుడు ధ్యానం కుదురుతుంది. ధారణ కుదురుతుంది. సమాధి కుదురుతుంది. కావాలంటే సిద్ధులు కుదురుతాయి. కనుక అట్టి యోగికి రససిద్ధునకు ఈ లోకంలో దుర్లభం లేదు.

---

**మూర్ఛితో హరతి వ్యాధిం మృతో జీవయతి స్వయమ్ ।**
**బద్ధః ఖేచరతాం ధత్తే బ్రహ్మత్వం రసచేతసి॥ 80**

**ప్రతిపదార్థం :–** మూర్ఛితః = మూర్ఛవచ్చునట్లు చేయబడినదైన రసము, వ్యాధిమ్ = వ్యాధిని, హరతి = హరించును. స్వయమ్ = స్వయముగా, మృతః = చచ్చినదై, జీవయతి = బ్రతికించును, బద్ధః = బంధింపబడినదై, ఖేచరతామ్ = ఆకాస సంచారమును, ధత్తే = కలిగించును. రసః = రసము, చేతసి = మనస్సునందు, బ్రహ్మత్వమ్ = బ్రహ్మభావమును, ధత్తే = కలిగించును.

**తాత్పర్యం :–** రసమే బ్రహ్మమను వాదం ఒకటి ఉన్నది. వారు రససిద్ధిలో కాయసిద్ధి పొంది శాశ్వతముగా జీవించగలరు. రసమునకు మూర్ఛనం మరణం, బంధము మొదలగు ప్రక్రియలుండును. రసమనగా పాదరసము. గంధకముతో కలిసి కజ్జలి చేయుట, దానిని గంధకాదులతో కలిపి చంపుట అనగా సిందూరపాకమువంటివి చేయుటద్వారా శరీరరోగ హరణము, సంజీవనము, ఖేచరత్వము, మనస్సిద్ధి ద్వారా బ్రహ్మానంద సిద్ధి జరుగగలదని రసవాదులు భావము ఇచ్చట చెప్పబడినది. ఇదంతా జ్ఞానమార్గే తరమయిన సాంకేతిక పదము.

---

## లయయోగమం

**ఇంద్రియాణాం మనో నాథో మనో నాథస్తు మారుతః ।**

**మారుతస్య లయో నాథః తన్నాథం లయమాశ్రయ॥ 81**

**ప్రతిపదార్థం :–** ఇంద్రియాణామ్ = ఇంద్రియాలకు, మనః = మనస్సు, నాథః = నాథుడు, మారుతస్తు = వాయువు, మనః = మనస్సుకు, నాథః = నాథుడు. మారుతస్య = వాయువునకు, లయః = లయము, నాథః = నాథుడు. తత్ = అందువలన, నాథమ్ = నాథుడయిన, లయమ్ = లయయోగమును, ఆశ్రయ = ఆశ్రయింపుము.

**తాత్పర్యం :–** ఇంద్రియాలకు అధిపతి మనస్సు. మనస్సుకు అధిపతి ప్రాణవాయువు. ప్రాణవాయువునకు అధిపతి లయము. కనుక సర్వనాథమయిన లయమును సేవింపుము. లయమనగా ఇంద్రియాలను మనస్సులో, మనస్సును ప్రాణములో ప్రాణములను పరదేవతలో కలిపి వేయటము లయము.

---

**నిశ్చేష్టో నిర్వికారశ్చ లయో జీవతి యోగినామ్।**

**ఉచ్ఛిన్నసర్వసంకల్పో నిశ్శేషాశేషచేష్టితః।**

**స్వావగమ్యో లయః కోఽపి మనసాం వాగగోచరః॥ 82**

**ప్రతిపదార్థం :–** యోగినామ్ = యోగులకు, నిశ్చేష్టః = కదలిక లేనిది, నిర్వికారశ్చ = వికారములు లేనిది అయిన, లయః = లయయోగము, జీవతి = జీవించును. ఉచ్ఛిన్న = తెగిపోయిన, సర్వ = సమస్తమయిన, సంకల్పః = సంకల్పములు గలదియు, నిశ్శేష = శేషములేని, అశేష = సమస్తమయిన, చేష్టితః = చేష్టలు కలదియు అగు, లయః = లయయోగము, కోఽపి = అనిర్వచనీమయినది. స్వావగమ్యః = తన అనుభవమునకు మాత్రమే తెలియునది. మనసామ్ = మనస్సులకు, వాక్ = వాక్కుకు, అగోచరః = అందనిది.

**తాత్పర్యం :–** ఈ లయయోగంలో యోగులు చేష్టారహితులుగానూ వికారశూన్యులుగానూ ఉండెదరు. సర్వసంకల్పములు తెగిపోవును. సమస్తచేష్టలు ఆగిపోవును. ఆ లయయోగదశ అనుభవైకవేద్యము. వాక్కుకు మనస్సుకు అగోచరము. అనిర్వచనీయము.





**పుంఖానుపుంఖవిషయేక్షణతత్పరోఽపి**

**బ్రహ్మావలోకనధియం న జహాతి యోగీ ।**

**సంగీతతాలలయవాద్యవశం గతాపి**

**మౌళిస్థకుంభపరిరక్షణధీః నటీవ॥ 83**

**ప్రతిపదార్థం :–** యోగీ = యోగి, పుంఖానుపుంఖ = పరంపరగా వచ్చుచున్న, విషయ = విషయములను, ఈక్షణ = గమనించుటయందు, తత్పరోఽపి = ఆసక్తునివలె ఉన్నను, బ్రహ్మావలోకన = సర్వత్ర బ్రహ్మదర్శనం చేయు, ధియం = బుద్ధిని, న జహాతి = వదలడు. ఎలా అంటే, సంగీత = సంగీతమునకు, తాల = తాళమునకు, లయ = లయకు, వాద్య = అంశవాద్యములకు, వశం గతాపి = వశమయినదిగా ఉన్నా, మౌళి = తలయందు, స్థ = ఉన్న, కుంభ = కుండయొక్క, పరిరక్షణ = పడకుండా రక్షించుటయందు, ధీః = బుద్ధిగల, నటీవ = నటివలె, యోగి = ప్రవర్తించును.

**తాత్పర్యం :–** నెత్తిన కుండపెట్టికొని నాట్యం చేసే నటీమణి సంగీతవాద్య లయను అనుసరించి గమనిస్తూ నృత్యం చేస్తూ గూడా తన తలపై ఉన్న కుండను పడకుండా రక్షించుచూ దానిమీద దృష్టిని మరల్చదు. అలాగే యోగి పుంఖానుపుంఖంగా పరంపరగా వస్తున్న విషయాలను గమనిస్తున్నా తన బ్రహ్మాత్మ భావననుండి మాత్రం దృష్టి మరల్చడు. అదే అసంగ యోగం.

---

**సర్వచింతాం పరిత్యజ్య సావధానేన చేతసా।**

**నాద ఏవానుసంధేయో యోగసామ్రాజ్యమిచ్ఛతా॥ 84**

**ప్రతిపదార్థం :–** సర్వచింతామ్ = సమస్త విషయధ్యానమును, పరిత్యజ్య = వదలి, సావధానేన = శ్రద్ధావంతమయిన, చేతసా = మనస్సుతో, యోగసామ్రాజ్యమ్ = యోగి రాజత్వమును, ఇచ్ఛతా = కోరు వానిచేత, నాద ఏవ = నాదమే, అనుసంధేయః = సంధింపదగినది.

**తాత్పర్యం :–**సమస్త విషయధ్యానమును వదలి శ్రద్ధాయుక్తమయిన మనస్సుతో నాదానుసంధానము చేయాలి. నాదానుసంధానమంతటి సంగీతం యోగి చేసే నాద లయయోగము కావచ్చును. కాని ప్రధానంగా ప్రాణనాద రూపమయిన

ప్రణవమును ఉపాసన చేస్తూ ప్రణవంలోనే మనస్సును లీనము చేయటం లయయోగము. దానిని సాధించినవాడు యోగసమ్రాట్టు అగును.

**ఇది ద్వితీయాధ్యాయము**

--





# తృతీయోఽధ్యాయః

## ఆత్మానుభవము

**న హి నానాస్వరూపం స్యాత్ ఏకం వస్తు కదాచన।**

**తస్మాదఖండ ఏవాస్మి యన్మదన్యన్న కించన॥ 85**

**ప్రతిపదార్థం :–** ఏకమ్ = ఒక్కటే అయిన, వస్తు = వస్తువు, కదాచన = ఎపుడయినా, నానాస్వరూపమ్ = బహురూపమయినది, న స్యాత్ హి = కాదుగదా!, తస్మాత్ = అందువలన, అఖండ ఏవ = అఖండ స్వరూపుడనే, అస్మి = అగుదును. యత్ =ఎందుకంటే, మత్ = నాకన్న, అన్యత్ = వేరయినది, కించన = ఏదయినను, న = లేదు.

**తాత్పర్యం :–** ఒక వస్తువు అనేక రూపాలలో ఉండదు. కనుక నేను అఖండ స్వరూపుడను. నా యందు ఖండములు లేవు. నాకన్న భిన్నంగా మరొక వస్తువేదీ లేదు. అందువలన గూడా నేను అఖండ స్వరూపుడను.

---

**దృశ్యతే శ్రూయతే యద్యత్ బ్రహ్మణోఽన్యన్న తద్భవేత్।**

**నిత్యశుద్ధవిముక్తైకమఖండానందమద్వయమ్।**

**సత్యం జ్ఞానమనంతం యత్ పరం బ్రహ్మ భవామి తత్॥ 86**

**ప్రతిపదార్థం :–** యద్యత్ = ఏది యేది, దృశ్యతే = కనబడునో, శ్రూయతే = వినబడునో,తత్ = అది, బ్రహ్మణః = బ్రహ్మం కన్న, అన్యత్ = వేరయినది, న భవేత్ = కాదు. నిత్య = నిత్యము, శుద్ధ = శుద్ధము, విముక్త = విముక్తము, ఏకమ్ = ఏకమయినదియు, అఖండ = అఖండమయినదియు, ఆనందమ్ = ఆనందమయినదియు, అద్వయమ్ = అద్వితీయమయినదియు, సత్యమ్ = సత్యమయినదియు, జ్ఞానమ్ = జ్ఞానమయినదియు, అనంతమ్ = అనంతమయినదియు అగు, యత్ = ఏది గలదో, తత్ = ఆ, పరమ్ = సర్వాతీతమయిన, బ్రహ్మ = బ్రహ్మమును, భవామి = కాగలను.

**తాత్పర్యం :–** మనకు కనబడేది వినబడేది ఏదయినా సరే! సర్వ పదార్థ సమూహమూ బ్రహ్మమే. బ్రహ్మంకన్న భిన్నమయినదేదియు లేదు. నిత్యము, శుద్ధము, ముక్తము,

ఏకము, అఖండము, ఆనందము, అద్వితీయము, సత్యము, జ్ఞానము, అనంతము, అయిన ఆ పరబ్రహ్మమునే నేను.

---

**ఆనందరూపోఽహమఖండబోధః**
**పరాత్పరోఽహం ఘనచిత్ప్రకాశః।**
**మేఘా యథా వ్యోమ న చ స్పృశంతి**
**సంసారదుఃఖాని న మాం స్పృశంతి॥ 87**

**ప్రతిపదార్థం :-** అహమ్ = నేను, ఆనందరూపః = ఆనంద స్వరూపుడను. అఖండ = అఖండమయిన, బోధః = జ్ఞానస్వరూపుడను, అహమ్ = నేను, పరాత్పరః = పరాత్పరుడను. ఘన = గొప్ప, చిత్ప్రకాశ := జ్ఞానప్రకాశ స్వరూపుడను. మేఘాః = మేఘములు, వ్యోమ = ఆకాశమును, యథా = ఏవిధముగా, న స్పృశంతి = తాకవో, తథా = ఆ విధంగా, సంసార = సంసార సంబంధమయిన, దుఃఖాని = దుఃఖములు, మామ్ = నన్ను, న స్పృశంతి = తాకవు.

**తాత్పర్యం :-** నేను ఆనందరూపుడను. అఖండ జ్ఞానరూపుడను. పరాత్పరుడను. ఘనమయిన జ్ఞానప్రకాశరూపుడను. ఆకాశంలో తిరిగే మేఘములు ఆకాశమును తాకనట్లు, సంసారదుఃఖములు నన్ను అంటవు.

---

**సర్వం సుఖం విద్ధి సుదుఃఖనాశాత్**
**సర్వం చ సద్రూపమసత్యనాశాత్।**
**చిద్రూపమేవ ప్రతిభానయుక్తం**
**తస్మాదఖండం మమ రూపమేతత్॥ 88**

**ప్రతిపదార్థం :-** దుఃఖ = గొప్ప లేదా మంచి సంసార దుఃఖములయొక్క, నాశాత్ = నాశమువలన, సర్వమ్ = సమస్తమును, సుఖమ్ = సుఖముగా, విద్ధి = ఎరుగుము. అసత్య = అసత్యముయొక్క, నాశాత్ = నాశనమువలన, సర్వం చ = సమస్తము, సద్రూపమ్ = సత్య స్వరూపము. ప్రతిభాన = భాసించటంతో, యుక్తమ్ = కూడిన దేదయినా, చిద్రూపమేవ=జ్ఞానస్వరూపమే, తస్మాత్= కనుక, ఏతత్ = ఆ ప్రపంచము, మమ = నాయొక్క, అఖండమ్ = అఖండమయిన, రూపమ్ = స్వరూపము.





**తాత్పర్యం :-** ప్రపంచంలో దుఃఖం తొలగిస్తే మిగిలినది సుఖమే. అసత్యం తీసివేస్తే మిగిలినది సత్యమే. మనకు కనబడేదంతా జ్ఞానమే. కనుక ఇదంతా నా అఖండ స్వరూపమే. మాయ అనృత జడ దుఃఖరూపము. అది తొలగితే సచ్చిదానందమయిన బ్రహ్మము తెలుస్తుంది. (సుదుఃఖము = కమ్మని దుఃఖం - అనగా సంసారం.)

---

**న హి జనిర్మరణం గమనాగమౌ**
**న చ మలం విమలం న చ వేదనమ్।**
**చిన్మయం హి సకలం విరాజతే**
**స్ఫుటతరం పరమస్య తు యోగినః॥ 89**

**ప్రతిపదార్థం :-** జనిః = జననము, మరణమ్ = మరణము, గమనాగమౌ = రాకపోకలు, నహి = లేవు గదా!, మలమ్ = మాలిన్యము, విమలమ్ = శుభ్రత, న = లేవు. వేదనం చ =తెలుపుటయు / దుఃఖము, న = లేదు. సకలమ్ = సమస్తము, చిన్మయం హి = జ్ఞానమయంగానే, విరాజతే = ప్రకాశించుచున్నది. పరమస్య = గొప్పవాడైన, యోగినః తు = యోగికయితే, స్ఫుటతరమ్ = మరింత స్పష్టముగా ప్రకాశించును.

**తాత్పర్యం :-** అసలీ ప్రపంచమంతా జ్ఞానస్వరూపమే. ఇందులో మనకు కనబడే జనన మరణాలు రాకపోకలు, శుద్ధి, మాలిన్యాలు, వేదనలు అంతా మిథ్య. ఉన్నట్లనిపిస్తాయి. కాని అంతా భ్రాంతిరూపము. అదే దృష్టి మహాయోగికి అత్యంత స్పష్టంగా ఉంటుంది.

---

**సత్యచిద్ఘనమఖండమద్వయమ్ సర్వదృశ్యరహితం నిరామయమ్।**
**యత్పదం విమలమద్వయం శివం తత్ సదాహమితి మౌనమాశ్రయ॥ 90**

**ప్రతిపదార్థం :-** సత్య = సత్యము, చిద్ఘనం = జ్ఞానవుముద్ద, అఖండం = సర్వ వ్యాప్తమయినది, అద్వయమ్ = ద్వితీయము లేనిది, సర్వ = సమస్తమయిన, దృశ్య = దృశ్యములతో, రహితం = శూన్యమయినది, నిరామయం = నిర్దోషమయినదియు, విమలం = నిర్మలము, అద్వయం = ద్వంద్వములు లేనిదియు, అయిన, శివం = మంగళమయిన, పదం = స్థానము, యత్ = ఏదిగలదో, తత్ = అది, సదా =

ఎల్లప్పుడు, అహం = నేను, ఇతి = అని, మౌనం = మౌనమును, ఆశ్రయ = ఆశ్రయింపుము.

**తాత్పర్యం :–** సత్యము, జ్ఞానఘనము, అఖండము, అద్వితీయము, సర్వసంసార శూన్యము, నిర్దోషము, నిర్మలము, ద్వంద్వ (శీతోష్ణం మొ॥) రహితము, మంగళము – అయిన ఆ తత్త్వమే నేనని నిత్యమూ భావించుచూ మౌనముగా నుండుము.

---

**జన్మమృత్యుసుఖదుఃఖవర్జితం జాతినీతికులగోత్రదూరగమ్।**
**చిద్వివర్తజగతోఽస్య కారణం తత్ సదాహమితి మౌనమాశ్రయ॥ 91**

**ప్రతిపదార్థం :–** జన్మ = జననము, మృత్యు = మరణము, సుఖ =సుఖము, దుఃఖ = దుఃఖములచే, వర్జితమ్ = విడువబడినదియు, జాతి = జాతికి, నీతి=నీతికి, కుల=వంశమునకు, గోత్ర = గోత్రమునకు, దూరగమ్=దూరమయినదియు, అస్య = ఈ, చిత్ = జ్ఞానముమీద ఏర్పడిన, వివర్త = భ్రాంతి రూపమయిన, జగతః = ప్రపంచమునకు, కారణమ్ = కారణమయిన, తత్ = ఆ బ్రహ్మమే, అహమ్ = నేను, ఇతి=అని, సదా= నిత్యం, మౌనమ్ = మౌనమును, ఆశ్రయ = ఆశ్రయించుము

**తాత్పర్యం :–** జనన మరణాలు, సుఖదుఃఖాలు, జాతులు, నీతులు, కులగోత్రాలు – వీటికి అతీతమయి యీ చైతన్య వివర్తమయిన ప్రపంచమునకు కారణమయిన ఆ అఖండ చైతన్యము నేనేనని భావిస్తూ ఇక చేయవలసిన దేదియు లేదు కనుక – మౌనంగా ఉండుము.

---

**పూర్ణమద్వయమఖండచేతనం విశ్వభేదకలనాదివర్జితమ్।**
**అద్వితీయపరసంవిదంశకంతత్ సదాహమితి మౌనమాశ్రయ॥ 92**

**ప్రతిపదార్థం :–** పూర్ణమ్ = అఖండమయినది, అద్వయమ్ = ద్వంద్వరహితము, అఖండ = సర్వవ్యాప్తమయిన, చేతనమ్ = చైతన్యముగలదియు, విశ్వభేద = ప్రపంచమునందలి భేదములయొక్క, కలనాది = గ్రహణము మొదలగువానితో, వర్జితమ్ = రహితమయినదియు, అద్వితీయ = ద్వితీయరహితమయిన, పర = అతీతమయిన, సంవిదంశకమ్ = జ్ఞాన భాగమయిన, తత్ = ఆ బ్రహ్మము, సదా



= నిత్యము, అహమ్ = నేనే, ఇతి = అని, మౌనమ్ = మౌనమును, ఆశ్రయ = ఆశ్రయింపుము.

**తాత్పర్యం :–** సర్వవ్యాప్తము, సుఖదుఃఖాది ద్వంద్వములు లేనిది, విశ్వగత సర్వభేదములకు అతీతమయినది. అద్వితీయమయినది. అయిన ఆ పరమ చైతన్యమే సర్వకాల సర్వావస్థలలోనూ, 'నేనే' అని నిష్క్రియుగా నిశ్శబ్దముగా స్వరూపానుభవములో ఉండుము.

---

**కేనాప్యబాధితత్వేన త్రికాలేఽప్యేకరూపతః।**
**విద్యమానత్వమస్త్యేతత్ సద్రూపత్వం సదా మమ॥ 93**

**ప్రతిపదార్థం :–** కేనాపి = దేశకాల వస్తువులచేతను, అబాధితత్వేన = బాధింపబడకపోవుటచేత, త్రికాలేఽపి = మూడు కాలములయందు, ఏకరూపతః = ఒకే రూపముగా ఉండటం వలనను, 'విద్యమానత్వం' = 'ఉనికి', అస్తి = కలదు. ఏతత్ = ఈ ఉనికి, మమ = నాయొక్క, సదా = శాశ్వతమయిన, సద్రూపత్వమ్ = సత్తా (ఉనికి) రూపమే.

**తాత్పర్యం :–** దేశకాల వస్తురీత్యా ఎటువంటి మార్పులు చేర్పులు లేకుండా ఏకరూపంగా ఉన్న 'ఉనికి' నాయొక్క సత్తయే. అని, బ్రహ్మసద్రూపము తన స్వరూపమే అని భావింపవలయును.

---

**నిరుపాధికనిత్యం యత్ సుప్తౌ సర్వసుఖాత్పరమ్।**
**సుఖరూపత్వమస్త్యేతత్ ఆనందత్వం సదా మమ॥ 94**

**ప్రతిపదార్థం :–** యత్ = ఏది, నిరుపాధిక = ఉపాధిరహితమై, నిత్యమ్ = నిత్యమయినదో, సుప్తౌ = నిద్రయందు, సర్వసుఖాత్ = సమస్త సుఖముకన్న, పరమ్ = అతీతమయినదియు, అగు, సుఖరూపత్వమ్ = సుఖ స్వరూపత్వము, అస్తి = ఉన్నదో. ఏతత్ = ఈ సుఖస్వరూపము, మమ = నాయొక్క, సదా = నిత్యమయిన, ఆనందత్వమ్ = ఆనంద స్వరూపము.

**తాత్పర్యం :–** ఆకాశము కొంతవరకు నిత్యము. కాని అది ఘటమఠాలలో చేరటం వలన అనిత్యంగా అనిపిస్తుంది. ఉపాధి రహితమయిన ఆకాశము ఎలా నిత్యమో

అలాగున ప్రపంచోపాధి రహితమయి నిత్యము, సుషుప్తిలో ఉన్న ఆనందం కన్న అతీతమూ, పరమసుఖం ఏదిగలదో అది నా శాశ్వతమయిన ఆనందరూపము.

---

**దినకరకిరణైర్హి శార్వరం తమో నిబిడతరం ఝటితి ప్రణాశమేతి।**
**ఘనతరభవకారణం తమో య ద్ధరిదినకృత్ప్రభయా న చాంతరేణ॥95**

**ప్రతిపదార్థం :–** దినకర = సూర్యునియొక్క, కిరణైః = కిరణములచేత, నిబిడతరమ్= అత్యంత సాంద్రమయిన (దట్టమయిన), శార్వరమ్ = రాత్రి సంబంధమయిన, తమః = చీకటి, ఝటితి = ఛట్టున, ప్రణాశమ్ = వినాశమును, ఏతి హి = పొందును గదా!, ఘనతర = దృఢతరమయిన, భవ = సంసారమే, కారణమ్ = కారణముగాగల, తమః = అజ్ఞానము, హరి = విష్ణువనే, దినకృత్ = సూర్యునియొక్క ప్రభయా = కాంతిచే, వినాశమును పొందును. అంతరేణ = మరొకదానితో, న చ = నశించదు. (న చాంతరేణ అవ్యవధానంగా నశించును.)

**తాత్పర్యం :–** రాత్రి అంధకారం ఎంతదట్టంగా ఉన్నా అది సూర్యకిరణాలతో పూర్తిగా నశిస్తుంది. అలాగే సంసారాంధకారమయిన అజ్ఞానం అహంకార మమకారాదులతో ఎంత దృఢంగా ఉన్నా విష్ణువనే సూర్యకిరణాలకు నశించిపోతుంది. అందుకు మరొక ఉపాయం లేదు. (లేదా. న చాంతరేణ = వ్యవధానం లేకుండా వెంటనే నశిస్తుంది. – అని చెప్పవచ్చు.)

---

**మమ చరణసర్మణేన పూజయా చ**
**స్వకతమసః పరిముచ్యతే హి జంతుః।**
**న హి మరణప్రభవప్రణాశహేతుః**
**మమ చరణస్మరణాదృతేఽస్తి కించిత్॥ 96**

**ప్రతిపదార్థం :–** మమ = నాయొక్క, చరణ = పాదములయొక్క, స్మరణేన = స్మరించుటచేత, పూజయా చ = పూజచేత, జంతుః = జీవుడు, స్వక = తనదయిన, తమసః = అజ్ఞానమునుండి, పరిముచ్యతే హి = విడువబడును గదా!, మమ = నాయొక్క, చరణ = పాదములయొక్క, స్మరణాదృతే = స్మరణం తప్ప, మరణ ప్రభవ = జనన మరణములయొక్క, ప్రణాశ = నాశమునకు, హేతుః = హేతువయినది, కించిత్ = ఏదయినను, నాస్తి హి = లేదుగదా!

**తాత్పర్యం :–** నా చరణ స్మరణము, పూజ – వీటివలన జీవుడు తన అజ్ఞానమునుండి బయటపడును. జన్మజరామరణదుఃఖమునుండి తప్పించేందుకు నా చరణస్మరణ తప్ప మరొక ఉపాయమేదియు లేదు.

---



**ఆదరేణ యథా స్తౌతి ధనవంతం ధనేచ్ఛయా।**
**తథా చేద్విశ్వకర్తారం కో న ముచ్యేత బంధనాత్॥ 97**

**ప్రతిపదార్థం :–** ధనేచ్ఛయా = ధనవాంఛతో, ధనవంతమ్ = ధనవంతుని, ఆదరేణ = ఆదరముతో, యథా = ఎలాగున, స్తౌతి = స్తుతించునో, తథా = ఆ విధముగా, విశ్వకర్తారమ్ = ప్రపంచ శిల్పినయిన నన్ను, చేత్ = స్తుతించినట్లయితే, కః = ఎవడు, బంధనాత్ = సంసారబంధమునుండి, న ముచ్యేత = విడువబడడు.

**తాత్పర్యం :–** ధనవాంఛతో ఒకడు ధనవంతుని వద్దకు వెళ్లి ఆదరంగా స్తుతిస్తాడు. అంతటి ఆదరంతో విశ్వకర్తను స్తుతించితే వాడు తప్పక సంసారబంధము నుండి బయటపడును.

---

**ఆదిత్యసన్నిధౌ లోకః చేష్టతే స్వయమేవ తు।**
**తథా మత్సంనిధావేవ సమస్తం చేష్టతే జగత్॥ 98**

**ప్రతిపదార్థం :–** ఆదిత్య = సూర్యునియొక్క, సన్నిధౌ = సన్నిధియందు, లోకః = లోకము, స్వయమేవ తు = స్వయంగానే, చేష్టతే = కదలుచుండును. తథా =అలాగే, మత్ = నాయొక్క, సన్నిధావేవ = సన్నిధియందే, సమస్తమ్ = సకలమయిన, జగత్ = ప్రపంచము, చేష్టతే = కదులుచుండును.

**తాత్పర్యం :–** సూర్యుని సన్నిధానములో ఈ లోకము స్వయంగానే సచేతనంగా ఉంటుంది. లేదంటే అచేతనంగా నిద్రిస్తుంది. అలా నా సన్నిధిలో ఈ ప్రపంచం అంతా కదులుతుంటుంది. అనగా చైతన్య సంబంధం వలననే ఈ ప్రపంచం నడుస్తున్నది.

---

**శుక్తికాయాం యథా తారం కల్పితం మాయయా తథా।**

**మహదాది జగన్మాయా మయం మయ్యేవ కేవలమ్॥ 99**

**ప్రతిపదార్థం :–** శుక్తికాయామ్ = ముత్యపుచిప్పయందు, మాయయా = అవిద్యచేత, తారమ్ = వెండి, యథా = ఎలా, కల్పితం = కల్పింపబడినదో, తథా = అలాగే, మాయామయం = మాయారూపమయిన, మహదాది = మహత్తు మొదలగు, జగత్ = ప్రపంచము, కేవలమ్ = కేవలముగా, మయ్యేవ = నాయందే కల్పింపబడినది.

**తాత్పర్యం :–** అవిద్య వలన ముత్తెపుచిప్పయందు వెండి కనబడినట్లు, రజ్జువు మీద సర్పము కనబడినట్లు, ఈ మహత్తు మొదలగు ప్రపంచము నాయందే మాయచేత కల్పింపబడినది.

---

**చండాలదేహే పశ్వాదిస్థావరే బ్రహ్మవిగ్రహే।**

**అన్యేషు తారతమ్యేన స్థితేషు న తథా హ్యహమ్॥ 100**

**ప్రతిపదార్థం :–** చండాల = చండాలునియొక్క, దేహే = శరీరమునందు, పశ్వాది = పశువు మొదలగు వాటియందు, స్థావరే = పర్వతాదులయందు, బ్రహ్మ = బ్రాహ్మణునియొక్క, విగ్రహే = శరీరమునందు, అన్యేషు = ఇతర అవయవాదులన్ని, తారతమ్యేన = తేడాతో, స్థితేషు = ఉండగా, అహమ్ = చైతన్యరూపుడనయిన నేను, తథా = అలా భిన్నంగా, నహి = లేను గదా!

**తాత్పర్యం :–** చండాల శరీరములోను, పశుశరీరంలోను, స్థావరాకారాలలోను బ్రాహ్మణ శరీరంలోనూ – మిగిలిన అవయవాదులు భిన్న భిన్నమయిన ఆకారాలతో గుణాలతో ఉంటాయి. కాని చైతన్యరూపుడనయిన నేను మాత్రము సర్వశరీరాలలోనూ ఒక్కటిగా ఉంటాను. భిన్నంగా ఉండను.

---

**వినష్టదిగ్భ్రమస్యాపి యథాపూర్వం విభాతి దిక్।**

**తథా విజ్ఞానవిధ్వస్తం జగన్మే భాతి తన్న హి॥ 101**

**ప్రతిపదార్థం :–** వినష్ట = నశించిన, దిగ్భ్రమస్యాపి = దిగ్భ్రాంతి కలవానికి, దిక్ = దిక్కు, యథాపూర్వమ్ = వెనుకటివలె, విభాతి = తెలియును. తథా = అలాగే, మే = నాయొక్క, విజ్ఞాన = విజ్ఞానముచేత, విధ్వస్తమ్ = ధ్వంసమయిన, తత్ = ఆ, జగత్ = ప్రపంచము, న భాతి హి = స్ఫురించదుగదా!



**తాత్పర్యం :–** ఒకనికి ఒకసారిగా మతి తప్పిచుట్టూ ఉన్న దిక్కులు తెలియవు. ఎటువెళ్లాలో తెలియదు. కొంతసేపటికి చుట్టూ ఉన్న గుర్తులను బట్టి దిగ్భ్రాంతి తొలగుతుంది. సరి అయిన దిక్కు తెలుస్తుంది. అలాగే నా జ్ఞానం వచ్చిన తర్వాత అట్టి జ్ఞానంతో అజ్ఞాన రూపమయిన ప్రపంచం తొలగిపోతుంది. ఇకవానికి ప్రపంచం కనబడదు. బ్రహ్మమే కనబడుతుంది.

---

**న దేహో నేంద్రియప్రాణో న మనోబుద్ధ్యహంకృతిః।**

**న చిత్తం నైవ మాయా చ న చ వ్యోమ్యాదికం జగత్॥ 102**

**ప్రతిపదార్థం :–** దేహః = శరీరము, న = కాను. ఇంద్రియప్రాణః = ప్రాణేంద్రియములు, న = కాను. మనోబుద్ధ్యహంకృతిః = మనోబుద్ధి అహంకారాలు, న = కావు. చిత్తమ్ = స్మరణ రూపమనోభాగము, న = కాను. మాయా చ = మాయయు, నైవ = కానే కాను. వ్యోమాదికమ్ = ఆకాశం మొదలగు, జగత్ = ప్రపంచముగూడా, న చ = కాను.

**తాత్పర్యం :–** దేహేంద్రియ ప్రాణములు నేను కాదు. మనోబుద్ధి చిత్తాహంకారాలు నేను కాదు. మాయగూడా నేనుకాను. ఆకాశము మొదలగు ప్రపంచము గూడా నేను కాను.

---

**న కర్తా నైవ భోక్తా చ న చ భోజయితా తథా।**

**కేవలం చిత్సదానందబ్రహ్మైవాహం జనార్దనః॥ 103**

**ప్రతిపదార్థం :–** కర్తా = కర్తను, న = కాను. భోక్తా చ = భోక్తనుగూడా, నైవ = కానే కాదు. తథా = అదే విధంగా, భోజయితా చ = భోగింపజేయువాడు గూడా, న = కాను. జనార్దనః = జనార్దనరూపుడయిన, అహమ్ = నేను, కేవలమ్ = కేవలమయిన, చిత్సదానంద = సచ్చిదానంద రూపమయిన, బ్రహ్మైవ = బ్రహ్మమునే.

**తాత్పర్యం :–** నేను కర్తనయిన, భోక్తనయిన జీవుడను కాను. భోగింపజేసే యీశ్వరుడను గాను. కేవలం సచ్చిదానంద స్వరూపుడను.

**జలస్య చంచలాదేవ చంచలత్వం యథా రవేః।**
**తథాహంకారసంబంధాదేవ సంసార ఆత్మనః॥ 104**

**ప్రతిపదార్థం :–**జలస్య = నీటియొక్క, చంచలాదేవ = చాంచల్యము వలననే, రవేః = సూర్య ప్రతిబింబమునకు, చంచలత్వమ్ = చాంచల్యము, యథా = ఎలా వచ్చునో, తథా = అలాగున, అహంకార = అహంకారముయొక్క, సంబంధాదేవ = సంబంధము చేతనే, ఆత్మనః = ఆత్మకు, సంసారః = సంసారము తగులును.

**తాత్పర్యం :–** సూర్యబింబమునకు నీటిలో ప్రతిబింబము పడుతుంది. నీరు కదిలితే ప్రతిబింబము కదులుతుంది. కాని బింబము కదలదు. ప్రతిబింబము కదలిక గూడా నీటి కదలికవలన అలా కనబడేది మాత్రమే. అలాగే అహంకార సంబంధం వలననే ప్రతిబింబరూపమయిన జీవాత్మకు సంసారం ఉన్నట్లు కనబడుతుంది. నిజానికి సంసారం అహంకారానిది.

---

**చిత్తమూలం హి సంసారః తత్ప్రయత్నేన శోధయేత్।**
**హంత!! చిత్తమహత్తాయాం కైషా విశ్వాసతా తవ॥ 105**

**ప్రతిపదార్థం :–** సంసారః = సంసారము, చిత్త = మనస్సే, మూలం హి = మూలముగా గలదిగా గదా!, తత్ = ఆ చిత్తమును, ప్రయత్నేన = ప్రయత్నముతో, శోధయేత్=శోధింపవలయును. హంత!=ఆహో!, చిత్త=చిత్తముయొక్క, మహత్తాయామ్ = గొప్పదనమునంధు, తవ=నీకు, ఏషా=ఈ, విశ్వాసతా = నమ్మకము, కా = ఏమిటి?

**తాత్పర్యం :–** సంసారం మనస్సుద్వారా వచ్చిన ఒక భ్రాంతి మాత్రమే. కనుక చిత్తమును బాగా శోధింపవలయును. ఆహో! నీకు చిత్తమహిమ మీద ఇంత విశ్వాసం ఎందుకు?

---

**క్వ ధనాని? మహీపానాం బ్రాహ్మణః క్వ జగంతి వా?।**
**ప్రాక్తనాని ప్రయాతాని గతాః సర్గపరంపరాః॥**
**కోటయో బ్రహ్మణాం యాతా భూపా నష్టాః పరాగవత్ । 106**





**ప్రతిపదార్థం :–** మహీపానామ్ = రాజులయొక్క, ధనాని = సామ్రాజ్యములు, క్వ = ఎక్కడ? బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, క్వ = ఎక్కడ? జగంతి వా = ప్రపంచములయినా, క్వ = ఎక్కడ? ప్రాక్తనాని = పూర్వజగత్తులు, ప్రయాతాని = చెల్లిపోయినవి, సర్గ = సృష్టులయొక్క, పరంపరాః = పరంపరలు, గతాః = గడచిపోయినవి. బ్రహ్మణామ్ = బ్రహ్మలయొక్క, కోటయః = కోట్లు, యాతాః = పోయినవి. భూపాః = రాజులు, పరాగవత్ = ధూళివలె, నష్టాః = నశించిరి.

**తాత్పర్యం :–** మహరాజుల రాజ్యాలెక్కడ? బ్రాహ్మణుల తపస్సులెక్కడ? ఈ ప్రపంచములెక్కడ? పాత ప్రపంచాలు పోయినాయి. సృష్టి పరంపరలే గతించినాయి. కోట్లమంది బ్రహ్మలు గతించారు. ధూళికణాలు లాగా చాలామంది భూపాలకులు నశించారు. (శ్లోకంలో “బ్రాహ్మణః” కన్న ‘బ్రహ్మణః’ అని ఉండాలి. అది బాగుంటుంది. అర్థము బ్రహ్మలు ఎక్కడ? –అని)

---

**స చాధ్యాత్మాభిమానోఽపి విదుషోఽప్యాసురత్వతః।**
**విదుషోఽప్యాసురశ్చేత్ స్యాత్ నిష్ఫలం తత్త్వదర్శనమ్॥ 107**

**ప్రతిపదార్థం :–** సచ = ఆ, ఆధ్యాత్మ = శరీరము మీద (ఏర్పడిన), అభిమానోపి = అభిమానముగూడా, విదుపి = జ్ఞానికయినను, ఆసురత్వతః = అసురత్వం వలన వస్తుంది. విదుషోపి = జ్ఞానికి గూడా, ఆసురః = అసురలక్షణమయిన దేహాద్యభిమానము, చేత్ = కలిగే పక్షంలో, తత్త్వ దర్శనమ్ = తత్త్వదృష్టి, నిష్ఫలమ్ = విఫలము అగును.

**తాత్పర్యం :–** జ్ఞానికి ప్రపంచం సత్యంగా భాసించదు. భాసిస్తే వాడు జ్ఞానికాడు. ఆత్మకాని దానియందు ఆత్మభావన. ఆత్మయందు అనాత్మ భావన – దేహాభిమానము, ఇవన్ని అసురలక్షణాలు. జ్ఞానికి గూడా మరల ఇవన్ని కలిగితే, అతని తత్త్వజ్ఞానము నిష్ఫలము.

---

**ఉత్పద్యమానా రాగాద్యాః వివేకజ్ఞానవహ్నినా।**
**యథా తదైవ దహ్యంతే కుతస్తేషాం ప్రరోహణమ్॥ 108**

ప్రతిపదార్థం :- ఉత్పద్యమానాః = పుట్టుచున్న, రాగాద్యాః = రాగద్వేషాదులు, వివేకజ్ఞాన = ఆత్మానాత్మ వివేకరూపమయిన జ్ఞానమను, వహ్నినా = అగ్నిచేత, తదైవ = పుట్టుక సందర్భంలోనే, దహ్యంతే = తగులబెట్టబడునో, తేషామ్ = వాటికి, పునః = మరల, ప్రరోహణమ్ = మొలచుట, కుతః = ఎట్లు జరుగును?

**తాత్పర్యం :-** మనస్సులో పుట్టున్న రాగద్వేషాదులు "ఆత్మా – అనాత్మ వివేకము", దృగ్ – దృశ్య వివేకము మొదలగువానితో, అవి పుట్టుచున్నపుడే తగలబడితే, ఇక ఆ దగ్ధబీజములు మొలవవు.

---

**యథా సునిపుణః సమ్యక్ పరదోషేక్షణే రతః॥**
**తథా చేత్ నిపుణః స్వేషు కో న ముచ్యేత బంధనాత్ ।** **109**

ప్రతిపదార్థం :- సునిపుణః = మంచి కౌశలముగలవాడు, పర = ఇతరులయొక్క దోష = దోషముయొక్క, ఈక్షణే = గమనించుటయందు, సమ్యక్ = బాగా, రతః = ఆసక్తుడో, తథా = అలాగే, స్వేషు = తనవయిన దోషములయందున్ను, చేత్ = గమనించుటయందాసక్తుడయితే, కః = ఎవడు, బంధనాత్ = సంసార బంధమునుండి, న ముచ్యేత = విడువబడడు?

**తాత్పర్యం :-** ఎదుటివాని దోషములను నిశితంగా గమనించే ఆసక్తి తన దోషము విషయంలో గూడా ఉంటే వాడు తప్పక సంసారబంధమునుండి బయటపడును.

---

## జ్ఞాని - అజ్ఞాని

**అనాత్మవిదముక్తోఽపి సిద్ధిజాలాని వాంఛతి ॥**
**ద్రవ్యమంత్రక్రియాకాలయుక్త్యాప్నోతి మునీశ్వర! ।**
**నాత్మజ్ఞస్యైష విషయ ఆత్మజ్ఞో హ్యాత్మమాత్రదృక్॥** **110**

ప్రతిపదార్థం :- అనాత్మవిత్ = ఆత్మవేత్త గానివాడు, అముక్తోఽపి = ముక్తుడు కానివాడున్ను, సిద్ధిజాలాని = అణిమాది సిద్ధి సమూహమును, వాంఛతి = కోరును. మునీశ్వర! = ఋభుమహర్షీ!, ద్రవ్య = ద్రవ్యంయొక్క, మంత్ర = మంత్రంయొక్క క్రియా = క్రియలయొక్క, కాల = కాలంయొక్క, యుక్త్యా= కలయిక చేత, ఆప్నోతి





= ఆ సిద్ధులను పొందును. ఆత్మజ్ఞస్య = ఆత్మజ్ఞానికి, ఏషః = ఇది, విషయః = విషయము, న = కాదు. ఆత్మజ్ఞః = ఆత్మజ్ఞాని, ఆత్మమాత్ర = ఆత్మను మాత్రమే, దృక్ = చూచువాడు, హి = కదా!

**తాత్పర్యం :-** ఆత్మజ్ఞానం లేనివాడు ముక్తివాంఛ లేనివాడున్ను ఈ అణిమాది సిద్ధులను తద్ద్వారా కీర్తి ప్రతిష్టలను కోరును. వీటిని కొన్ని ద్రవ్యాలద్వారా (రససిద్ధి) మంత్రాల ద్వారా, క్రియలద్వారా, కాలాల ద్వారా (అర్ధరాత్రి – ఓషధులు, మణులు, మంత్రాలు) ఇలా) ఈ సిద్ధులను పొందుతాడు. ఆత్మజ్ఞానికి ఈ సిద్ధులు అవసరము లేదు. అతనికి ఆత్మదృష్టి తప్ప మరేమీ ఉండదు.

---

**ఆత్మనాత్మని సంతృప్తో నావిద్యామనుధావతి।**
**యే కేచన జగద్భావాః తానవిద్యామయాన్విదుః॥** **111**

ప్రతిపదార్థము :- ఆత్మనా = ఆత్మతో, ఆత్మని = ఆత్మయందే, సంతృప్తః = తృప్తి చెందినవాడై, అవిద్యామ్ = అవిద్యను, నానుధావతి = వెంబడించడు. యే = ఏ, జగద్భావాః = ప్రపంచపదార్థాలు, కేచన = కొన్ని గలవో, తాన్ = వాటిని, అవిద్యామయాన్ = అజ్ఞానమయమయిన వానినిగా, విదుః = ఎరుగుదురు.

ప్రతిపదార్థం :- ఆత్మజ్ఞాని ఆత్మరతుడు. ఆత్మక్రీడుడు వానికి ప్రపంచ పదార్థములన్ని అజ్ఞానమయంగా కనబడతాయి. కనుక అతను అవిద్యామయమయిన యీ పదార్థము వెంట, సిద్ధుల వెంట పడడు.

---

**కథం తేషు కిలాత్మజ్ఞః త్యక్తావిద్యో విమజ్జతి ।**
**ద్రవ్యమంత్రక్రియాకాలయుక్తయః సాధుసిద్ధిదాః॥**
**పరమాత్మపదప్రాప్తౌ నోపకుర్వంతి కాశ్చన ।** **112**

ప్రతిపదార్థం :-త్యక్త = వదలబడిన, అవిద్యః = అజ్ఞానంగలవాడు అగు, ఆత్మజ్ఞః = ఆత్మజ్ఞాని, తేషు = ఆ ప్రపంచ పదార్థములయందు, కథం కిల = ఎట్లు, విమజ్జతి = మునుగగలడు? ద్రవ్య = ద్రవ్యములు, మంత్ర = మంత్రములు, క్రియ = క్రియలు, కాల = కాలములు, యుక్తయః = యోగములు, సిద్ధిదాః = సిద్ధిదాయకములే. సాధు = మంచిదే. కాని, పరమాత్మ పద = పరమాత్మ

స్థానముయొక్క, ప్రాప్తౌ = ప్రాప్తి విషయమై, కాశ్చన = కొన్ని గూడా, నోపకుర్వంతి = ఉపకరించవు.

**తాత్పర్యం :–** ద్రవ్యమంత్ర క్రియాది సాధ్యమయిన సిద్ధులు గొప్పవే. కాని అవి అవిద్యామయములు. అవి ఆత్మజ్ఞానానికి కొంచెమయినను ఉపయోగపడవు. కనుక ఆత్మజ్ఞాని వాటిలో మునగడు.

---

**సర్వేచ్ఛాకలనాశాంతావాత్మలాభోదయాభిధః॥**
**స పునః సిద్ధివాంఛాయాం కథమర్హత్యచిత్తకః॥ 113**

**ప్రతిపదార్థము :–** సర్వేచ్ఛాకలనా = సమస్త వాంఛావృత్తులయొక్క, శాంతౌ = శమకాలంలో, ఆత్మలాభ = ఆత్మప్రాప్తియొక్క, ఉదయ = పుట్టుకయందు, అభిధః = పేరుగలవాడును, అచిత్తకః = మనస్సులేని వాడును అగు, సః = ఆ జ్ఞాని, సిద్ధివాంఛాయామ్ = సిద్ధులపై కోరికయందు, కథం పునః = ఎట్లు, అర్హతి = అర్హుడగును?

**తాత్పర్యం :–** సమస్తవాంఛలు అవగాహనలు శమించిన తర్వాత ఆత్మజ్ఞానం గలవాడుగా పేరందిన చిత్తరహితుడైన యోగి మరల సిద్ధులపై ఎట్లు మోజుపడును?

(ఇచ్చట సకథం సిద్ధివాంఛాయాం, బదులు సపునః సిద్ధివాంఛాయాం' అను పాఠము స్వీకరింపబడెను. దానివలన 'కథం' రెండుసార్లు వ్యర్థంగా రాదు. 'లాభోదయాభిధః" అని రెండు పాఠాలు ఒక్కటిలాగానే ఉన్నాయి. కాని అర్థం బాగుండలేదు. 'లాభోదయాభిదః' అని పాఠం సవరిస్తే "ఆత్మజ్ఞానోదయంచేత, భేదదృష్టి లేనివాడు' అని చక్కని అర్థం వస్తుంది.)

**ఇది తృతీయాధ్యాయము**

---



# చతుర్థోఽధ్యాయః

## జీవన్ముక్తుడు

**అథ హ ఋభుం భగవంతం నిదాఘః పప్రచ్ఛ జీవన్ముక్తి ।**
**లక్షణమనుబ్రూహీతి తథేతి స హోవాచ । 114**

**ప్రతిపదార్థం :–** అథ హ = తరువాత, భగవంతమ్ = శక్తి సంపన్నుడయిన, సర్వజ్ఞుడయిన, ఋభుమ్ = ఋభువును, నిదాఘః = నిదాఘుడు, పప్రచ్ఛ = అడిగెను. జీవన్ముక్తి = జీవితకాలంలోనే కలిగే ముక్తియొక్క, లక్షణమ్ = లక్షణమును, అనుబ్రూహీతి = చెప్పుమని అడిగెను. సహ = అతడు, తథా + ఇతి = అలాగేనని, ఉవాచ = పలికెను.

**తాత్పర్యం :–** వరాహస్వామివద్ద జ్ఞానసంపన్నుడయిన ఋభుమహర్షిని నిదాఘుడు ప్రశ్నించెను. జీవన్ముక్తుని లక్షణము చెప్పుమని అడిగెను. ఆయన అంగీకరించి చెప్పటం ప్రారంభించెను.

---

**సప్తభూమిషు జీవన్ముక్తాశ్చత్వారః। శుభేచ్ఛా ప్రథమా భూమికా భవతి।**
**విచారణా ద్వితీయా। తనుమానసీ తృతీయా। సత్త్వా పత్తిః తురీయా**
**అసంసక్తిః పంచమీ। పదార్థభావనా షష్ఠీ తురీయగా సప్తమీ। 115**

**ప్రతిపదార్థం :–** సప్త = 7 అయిన, భూమిషు = దశలయందు, చత్వారః = నాలుగు రకములు, జీవన్ముక్తాః = జీవన్ముక్తులు గలరు. శుభేచ్ఛా = శుభేచ్ఛ అనబడు సంకల్పభూమిక, ప్రథమా = మొదటిది, విచారణ = విచారణ అనునది, ద్వితీయా = రెండవది, తనుమానసీ = తనుమానసి అనునది, తృతీయా = మూడవది, సత్త్వాపత్తిః = సత్త్వాపత్తి అనునది, తురీయా = నాల్గవది, అసంసక్తిః = అసంసక్తి అనునది, పంచమీ = ఐదవది, పదార్థభావనా = పదార్థ భావన అనునది, షష్ఠీ = ఆరవది, తురీయగా = తురీయగ అనునది, సప్తమీ = ఏడవది.

**తాత్పర్యం :–** భూమికలు – అనగా దశలు ఏడు. అందులోనే నాల్గురకాల జీవన్ముక్తులు సాగుతుంటారు. అవి ఇవి. 1. శుభేచ్ఛ 2. విచారణ 3. తనుమానసి

4. సత్త్వాపత్తి 5. అసంసక్తి 6. పదార్థభావన 7. తురీయగ. (123 శ్లోకం నుంచి వీటి వివరణగలదు.)

---

## ప్రణవ విచారము

**ప్రణవాత్మికా భూమికాః అకారోకారమకారార్ధమాత్రాత్మికాః।**
**స్థూలసూక్ష్మబీజసాక్షిభేదేన అకారాదయః చతుర్విధాః।**
**తదవస్థాః। జాగ్రత్స్వప్నసుషుప్తితురీయాః॥ 116**

**ప్రతిపదార్థం :–** ప్రణవాత్మికాః = ఓంకార స్వరూపమయిన, భూమికాః = దశలు, అకార, ఉకార, మకార, అర్ధమాత్రాత్మికాః = 'అ ఉమ్ " అను స్వరూపము గలవి. అకారాదయ, అకారాది వర్ణములు, స్థూల, సూక్ష్మబీజ, సాక్షిభేదేన = స్థూలము, సూక్ష్మము, కారణము, సాక్షి, – అను భేదముచేత, చతుర్విధాః = నాల్గురకాలు. తదవస్థాః = వాటి అవస్థలు, జాగ్రత్ = జాగరణమని, స్వప్న = 'కల' అని, సుషుప్తి = గాఢనిద్ర అని, తురీయాః = సమాధి అని నాల్గురకములు.

**తాత్పర్యం :–** ఓంకారంలో నాల్గు భూమికలు గలవు. అందలి అక్షరములు 'అ, ఉ, మ, ల' అనునవి. ఇవి నాల్గురకములు. స్థూలము, సూక్ష్మము, కారణము, సాక్షి. వాటి అవస్థలు నాల్గు రకములు. జాగరణము, స్వప్నము, సుషుప్తి, సమాధి.

---

**అకారస్థూలాంశే జాగ్రద్విశ్వః। సూక్ష్మాంశే తత్ తైజసః।**
**బీజాంశే తత్ప్రాజ్ఞః। సాక్ష్యంశే తత్తురీయః। 117**

(వీటికి ప్రతిపదార్థం అవసరం లేదు.)

**తాత్పర్యం :–** అకారముయొక్క స్థూలాంశమున నున్న జాగ్రదవస్థకు విశ్వుడు అధ్యక్షుడు. సూక్ష్మాంశకు జాగ్రత్తైజసుడు, బీజాంశ (కారణాంశ)కు జాగ్రత్ప్రాజ్ఞుడు, సాక్షి – అంశకు (తురీయాంశ) జాగ్రత్తురీయుడు అధ్యక్షుడు.

---

**ఉకారస్థూలాంశే స్వప్నవిశ్వః। సూక్ష్మాంశే తత్తైజసః।**
**బీజాంశే తత్ప్రాజ్ఞః। సాక్ష్యంశే తత్తురీయః। 118**





**తాత్పర్యం :–** ఉకారం స్వప్నదశ కనుక దీని స్థూలాంశమునకు స్వప్నవిశ్వుడు. సూక్ష్మాంశమునకు స్వప్నతైజసుడు. బీజాంశమునకు స్వప్నప్రాజ్ఞుడు. సాక్ష్యంశమునకు స్వప్న తురీయుడు అధ్యక్షులు.

---

**మకారస్థూలాంశే సుషుప్తవిశ్వః। సూక్ష్మాంశే తత్తైజసః।**
**బీజాంశే తత్ప్రాజ్ఞః। సాక్ష్యంశే తత్తురీయః॥ 119**

**తాత్పర్యం :–** మకార స్థూలాంశమునకు సుషుప్త విశ్వుడు, సూక్ష్మాంశమునకు సుషుప్త తైజసుడు, బీజాంశమునకు సుషుప్త ప్రాజ్ఞుడు, సాక్ష్యాంశమునకు సుషుప్త తురీయుడు, అధ్యక్షులు.

---

**అర్ధమాత్రాస్థూలాంశే తురీయవిశ్వః సూక్ష్మాంశే తత్తైజసః।**
**బీజాంశే తత్ప్రాజ్ఞః। సాక్ష్యంశే తురీయతురీయః॥ 120**

**తాత్పర్యం :–** ఇది అర్ధమాత్ర. దీని స్థూలాంశమునకు తురీయ విశ్వుడు, సూక్ష్మాంశమునకు తురీయ తైజసుడు, బీజాంశమునకు తురీయప్రాజ్ఞుడు, సాక్ష్యంశమునకు తురీయ తురీయుడు అధ్యక్షుడగును. దీనిని 'పరాభూమి' అంటారు.

---

**అకారాదితురీయాంశాః ప్రథమద్వితీయతృతీయభూమికాః।**
**ఉకారతురీయాంశాః చతుర్థీ భూమికా। మకారతురీయాంశాః**
**పంచమీ। అర్ధమాత్రాప్రవిభక్తప్రథమద్వితీయతృతీయాంశాః**
**షష్ఠీ భూమికా। తదతీతా సప్తమీ భూమికా॥ 121**

**తాత్పర్యం :–** అకారాది తురీయాంశలు ప్రథమ, ద్వితీయ తృతీయ భూమికలు. ఉకార తురీయాంశము చతుర్థ భూమిక. మకార తురీయాంశము పంచమ భూమిక. అర్ధమాత్రలోని ప్రథమ ద్వితీయ తృతీయాంశలు ఆరవభూమిక. వీటికి అతీతమయిన అర్ధమాత్ర తురీయాంశ సప్తమభూమిక అవుతుంది.

---

**భూమిత్రయేషు విహరన్ ముముక్షుర్భవతి। తురీయభూమ్యాం విహరన్ బ్రహ్మవిద్భవతి। పంచమభూమ్యాం విహరన్ బ్రహ్మవిద్వరో భవతి। షష్ఠభూమ్యాం విహరన్ బ్రహ్మవిద్వరీయాన్ భవతి। సప్తమభూమ్యాం విహరన్ బ్రహ్మవిద్వరిష్ఠో భవతి। 122**

**తాత్పర్యం :–** ఇందులో శుభేచ్ఛా, విచారణా, తనుమానసీ భూమికలు మొదటి మూడు. ఇందులో విహరించువాడు మోక్షవాంఛగల వాడవుతాడు. తురీయ భూమికలో – సత్త్వాపత్తిలో – విహరించువాడు 'బ్రహ్మవిత్' అవుతాడు. అసంసక్తి అను పంచమభూమికలో 'బ్రహ్మవిద్వరుడు' అవుతాడు. 'పదార్థభావన' అను ఆరవ భూమికలో విహరించువాడు "బ్రహ్మవిద్వరీయుడు" అవుతాడు. కేవలము సప్తమ భూమికలో – తురీయగలో ఉండువాడు 'బ్రహ్మవిద్వరిష్ఠుడు' అవుతాడు. ఈవిధంగా జీవన్ముక్తులు చతుర్విధంగా సప్తభూమికలలో విహరిస్తుంటారు.

ఇక్కడకు 'బ్రాహ్మణం' ముగిసింది. ఇక మంత్రశ్లోకం మొదలవుతుంది.

---

## సప్తభూమికలు

**జ్ఞానభూమిః శుభేచ్ఛా స్యాత్ ప్రథమా సముదీరితా।**
**విచారణా ద్వితీయా తు తృతీయా తనుమానసీ॥**
**సత్త్వాపత్తిశ్చతుర్థీ స్యాత్ తతోఽ సంసక్తి నామికా।**
**పదార్థ భావనా షష్ఠీ సప్తమీ తుర్యగా స్మృతా॥ 123**

**తాత్పర్యం :–** జ్ఞానభూమిక శుభేచ్ఛ. అది ప్రథమ భూమిక. రెండవది విచారణ. మూడవది తనుమానసి. నాల్గవది సత్త్వాపత్తి. ఐదవది అసంసక్తి. ఆరవది పదార్థభావన. ఏడవది తురీయగ / తుర్యగ. ఇది సంగ్రహ శ్లోకము.

---

**స్థితః కిం మూఢ ఏవాస్మి ప్రేక్ష్యోఽహం శాస్త్రసజ్జనైః।**
**వైరాగ్యపూర్వమిచ్ఛేతి శుభేచ్ఛేత్యుచ్యతే బుధైః॥ 124**

**ప్రతిపదార్థం :–** అస్మి = నేను, మూఢ ఏవ = మూఢునిగనే, స్థితః కిం = ఎందుకున్నాను? శాస్త్ర = శాస్త్రం ద్వారా, సజ్జనైః = సత్పురుషులద్వారా, అహం = నేను, ప్రేక్ష్యః = తెలిసికొనదగినవాడను. ఇతి = అని, వైరాగ్యపూర్వం = వైరాగ్య పూర్వకముగా వచ్చిన, ఇచ్ఛా = కోరిక, శుభేచ్ఛా ఇతి = శుభేచ్ఛ అని, బుధైః = జ్ఞానులచేత, ఉచ్యతే = చెప్పబడును.

**తాత్పర్యం :–** నేను ఇట్లా మూఢంగా ఉన్నానేమిటి? నేను దృక్కునా, దృశ్యమునా? ఈ విషయాలను శాస్త్రందద్వారా, సజ్జనుల ద్వారా నేను గ్రహించాలి – అని వైరాగ్యపూర్వకంగా కలిగిన జిజ్ఞాస శుభేచ్ఛ.

---

**శాస్త్రసజ్జనసంపర్కవైరాగ్యాభ్యాసపూర్వకమ్।**
**సదాచారప్రవృత్తిర్యా ప్రోచ్యతే సా విచారణా॥ 125**

**ప్రతిపదార్థం :–** శాస్త్ర = శాస్త్రముతోను, సజ్జన = సజ్జనులతోను, సంపర్క = సంబంధము, వైరాగ్యాభ్యాస = వైరాగ్యమునలవాటు చేసికొనుట, పూర్వకమ్ = పూర్వముగా ఉండునట్లు. యా = ఏ, సదాచార = సదాచారములందు, ప్రవృత్తిః = ప్రవర్తించుట గలదో, సా = అది, విచారణా = విచారణ అని, ప్రోచ్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యం :–** శాస్త్ర సజ్జన పరిచయాలవలన వైరాగ్యం గలిగి దానిని అలవరచికొంటూ జ్ఞానానికి కావలసిన ఉపాసనాది సదాచార ప్రవృత్తి కలిగి ఉంటే ఆ దశను 'విచారణ' అంటారు.

---

**విచారణాశుభేచ్ఛాభ్యాం ఇంద్రియార్థేషు రక్తతా।**
**యత్ర సా తనుతామేతి ప్రోచ్యతే తనుమానసీ॥ 126**

**ప్రతిపదార్థం :–** ఇంద్రియార్థేషు = ఇంద్రియ విషయమయిన భోగములందు, రక్తతా = ఆసక్తి, విచారణా = విచారణచేత, శుభేచ్ఛాభ్యామ్ = శుభేచ్ఛచేత, యత్ర = ఏ దశలో, తనుతామ్ = స్వల్పతను, ఏతి = పొందునో, సా = ఆ దశ, తనుమానసీ = తను మానసి అని, ప్రోచ్యతే = చెప్పబడును.

**తాత్పర్యం :–** శుభేచ్ఛవలన విచారణవలన వైరాగ్యము పెరిగి ఇంద్రియ సంబంధమయిన విషయభోగాలయందు ఆసక్తి సన్నగిల్లిన దశ "తనుమానసి".

---

**భూమికాత్రితయాభ్యాసాత్ చిత్తేఽర్థవిరతేర్వశాత్।**
**సత్త్వాత్మని స్థితే శుద్ధే సత్త్వాపత్తిరుదాహృతా॥ 127**

**ప్రతిపదార్థం :–** భూమికాత్రితయ = ఈ – మూడు భూమికలయందలి, అభ్యాసాత్ = అభ్యాసక్రియవలన, అర్థవిరతేః = విషయకాంక్షా శాంతియొక్క, వశాత్ = వశం వలన, శుద్ధే = శుద్ధమయిన, చిత్తే = మనస్సు, సత్త్వాత్మని = సత్త్వరూపమునందు, స్థితే = ఉండగా, ఆ స్థితి, "సత్త్వాపత్తిః" = సత్త్వాపత్తి అని, ఉదాహృతా = చెప్పబడినది.

**తాత్పర్యం :–** శుభేచ్ఛ, విచారణ, తనుమానసీ – ఈ భూమికలలోని అనుసంధాన బలంతో విషయ వైరాగ్యం పొందిన మనస్సు శుద్ధమయి సత్త్వరూప స్థితిలో ఉంటుంది. ఈ భూమికను సత్త్వాపత్తి అని చెప్పబడినది.

---

**దశాచతుష్టయాభ్యాసాదసంసర్గఫలా తు యా॥**
**రూఢసత్త్వచమత్కారా ప్రోక్తాసంసక్తినామికా। 128**

**ప్రతిపదార్థం :–** దశా = భూమికలయొక్క, చతుష్టయ = నాల్గింటియొక్క, అభ్యాసాత్ = అభ్యాసమువలన, అసంసర్గ = అసంగ రూపమయిన, ఫలా = ఫలంగల, యా = ఏ భూమికగలదో, రూఢ = గట్టిపడిన, సత్త్వ = సత్త్వగుణముయొక్క, చమత్కారా = అద్భుతాలుగల, సాఽతు = ఆ స్థితి, అసంసక్తినామికా = అసంసక్తి (అసంగము) అను పేరుగలదిగా, ప్రోక్తా = చెప్పబడినది.

**తాత్పర్యం :–** పైన చెప్పిన నాల్గు దశలలోను చేసిన అభ్యాసాలవలన సత్త్వగుణం బాగా గట్టిపడి ఫలితంగా 'అసంగం' ఏర్పడుతుంది. ఈ భూమికను 'అసంసక్తి' అంటారు.

---

**భూమికాపంచకాభ్యాసాత్ స్వాత్మారామతయా భృశమ్।**
**ఆభ్యంతరాణాం బాహ్యానాం పదార్థానామభావనాత్॥ 129**
**పరప్రయుక్తేన చిరం ప్రయత్నేనావబోధనమ్।**
**పదార్థభావనా నామ షష్ఠీ భవతి భూమికా॥ 130**





**ప్రతిపదార్థం :–** భూమికా పంచక = పైన చెప్పిన పంచభూమికలయొక్క, అభ్యాసాత్ = అలవాటు చేయడంవలన, భృశమ్ = మిక్కిలి, స్వాత్మారామతయా = తనయందు తానే ఆనందించటం వలన, ఆభ్యంతరాణామ్ = తనలోని, బాహ్యానామ్ = బయటి ప్రపంచంలోనివి అయిన, పదార్థానామ్ = పదార్థములయొక్క, అభావనాత్ = భావనలేక పోవటం వలన, చిరమ్ = చాలాసేపు, పర =ఇతరుల చేత, ప్రయుక్తేన = ప్రయోగింపబడిన, ప్రయత్నేన = ప్రయత్నముచేత, అవబోధనమ్ = సమాధి స్థితినుండి మేల్కొలుపుట అనునది, పదార్థభావనా నామ = పదార్థభావన అని పేరుగల, షష్ఠీ = ఆరవదయిన, భూమికా = భూమిక, భవతి = అగును.

**తాత్పర్యం :–** గత ఐదుభూమికల అభ్యాసం వలన సమాధి చ్ఛాయ ఎక్కువయి యోగి నిత్యము ఆత్మానందరసమగ్నుడయి ఉంటాడు. అతనిలో బాహ్యాంతర పదార్థాల స్పృహ ఉండదు. ( ఇలాంటి స్థితి రామకృష్ణ పరమహంసకుండేదని వింటున్నాము) వీరిని వ్యవహారస్థితిలోనికి తేవటానికి ఇతరులు తీవ్రంగా ప్రయత్నించాలి. దీనిని పదార్థ భావనాస్థితి అంటారు. దేహక్రియా నిర్వహణకోసం ఇలా లేపవలసి వస్తుంది. (శారదాదేవి రామకృష్ణులను ఇలాగే మేల్కొలపవలసి వచ్చేదట).

---

**భూమిషట్కచిరాభ్యాసాద్భేదస్యానుపలంభనాత్ ।**
**యత్స్వభావైకనిష్ఠత్వం సా జ్ఞేయా తుర్యగా గతిః॥ 131**

**ప్రతిపదార్థం :–** భూమిషట్క = పైన చెప్పిన ఆరు భూమికలయొక్క, అభ్యాసాత్ = అభ్యాసమువలన, భేదస్య = భేదముయొక్క, అనుపలంభనాత్ = దొరకక పోవుటవలన, స్వభావ = ఆత్మభావము, ఏక = ఒక్కదానియందే, నిష్ఠత్వమ్ = ఉండుట, యత్ = ఏదిగలదో, సా = అది, తుర్యగా = తురీయగా అను, గతిః = దశగా, జ్ఞేయా = తెలిసికొనదగినది.

**తాత్పర్యం :–** పైన లెక్కించిన ఆరుభూమికల అభ్యాసంవలన క్రమంగా ద్వైతం నశించి కేవలం ఆత్మభావంలోనే ఉండే స్థితి. 'తురీయగా' భూమిక – ఏడవది.

(ఈ భూమికా విషయాలు మహోపనిషత్తు అన్నపూర్ణోపనిషత్తు, అక్షి – ఉపనిషత్తులలోనూ ఉన్నవి.)

---

శుభేచ్ఛాదిత్రయం భూమిభేదాభేదయుతం స్మృతమ్ ।
యథావద్వేద బుద్ధ్వేదం జగజ్జాగ్రతి దృశ్యతే॥ 132

**ప్రతిపదార్థం :–** శుభేచ్ఛాదిత్రయమ్ = శుభేచ్ఛ, విచారణ, తనుమానసి అనునవి మూడు, భూమి = భూమికలలో, భేదాభేద = భేదాభేదములతో, యుతమ్= కూడినదిగా, స్మృతమ్ = తలచబడినవి. ఇదమ్ = ఈ, జగత్ = ప్రపంచము, జాగ్రతి = జాగరణమునందు, దృశ్యతే = ఎలా కనబడుచున్నదో, అలా యథావత్ = ఉన్నదున్నట్లుగా, బుద్ధ్వా = బుద్ధితో, వేద = ఎరుగును.

**తాత్పర్యం :–** శుభేచ్ఛ మొదలయిన మూడు భూమికలలో ద్వైతం అద్వైతం దోబూచులాడుతుంటాయి. ఇది ప్రయత్నదశ. కనుక జాగరణంలో ప్రపంచం ఎలా కనబడుతున్నదో అలాగే బుద్ధితో గ్రహిస్తారు.

---

అద్వైతే స్థైర్యమాయాతే ద్వైతే చ ప్రశమం గతే।
పశ్యంతి స్వప్నవల్లోకం తుర్యభూమిసుయోగతః॥ 133

**ప్రతిపదార్థం :–** అద్వైతే = అద్వైతభావన, స్థైర్యమ్ = దృఢత్వమును, ఆయాతే = పొందగా, ద్వైతే = ద్వైతము, ప్రశమమ్ = శమమును, గతే చ = పొందగా, తుర్యభూమి = సత్త్వాపత్తియను భూమికయొక్క, యోగతః = సంబంధమువలన, లోకమ్ = లోకమును, స్వప్నవత్ = కలను వలె, పశ్యంతి = చూచెదరు.

**తాత్పర్యం :–** తుర్యభూమిక అయిన సత్త్వాపత్తి దశలో ద్వైతభావనలు అణగటం అద్వైతభావన అభివృద్ధి గావటం వలన యోగి యీ లోకవ్యవహారమంతటిని ఒక స్వప్నంగా చూస్తుంటాడు.

---

విచ్ఛిన్నశరదభ్రాంశవిలయం ప్రవిలీయతే।
సత్త్వావశేష ఏవాస్తే హే! నిదాఘ! దృఢీకురు॥ 134

**ప్రతిపదార్థం :–** హే నిదాఘ! = ఓ నిదాఘా!, విచ్ఛిన్న = ముక్కలు ముక్కలయిన, శరదభ్ర = శరన్మేఘముయొక్క, అంశ = ముక్కలు, విలయమ్ = ఆకాశంలో లయము చెందినట్లు, ప్రవిలీయతే = కరగును. సత్త్వ = సత్త్వగుణముయొక్క, అవశేషః ఏవ = శేషమే, ఆస్తే = ఉండును, దృఢీకురు = బాగాతెలిసికొని గట్టిచేసికో!





**తాత్పర్యం :–** నిదాఘ! సత్త్వాపత్తి దశలో సత్త్వమే మిగులుతుంది. శర్మనేఘాలు ఎలా తెల్లటి ముక్కలుగా ఉండి ఆకాశంలో కలుస్తాయో యీ ప్రపంచం కరిగిపోతుంది. సత్త్వం మిగులుతుంది. దానిని దృఢంగా చేసికొనుము.

---

పంచభూమిం సమారుహ్య సుషుప్తిపదనామికామ్।
శాంతాశేషవిశేషాంశః తిష్ఠత్యద్వైతమాత్రకే॥ 135

**ప్రతిపదార్థం :–** సుషుప్తి పద = సుషుప్తి అను పదము, నామికాం = పేరుగా గలదియగు, పంచభూమిం = పంచమమయిన అసంసక్తిని, సమారుహ్య = ఎక్కి, శాంత = శమించిన, అశేష = సమస్తమయిన, విశేషాంశః = ప్రత్యేక అంశములు గలవాడై, అద్వైతమాత్రకే = కేవలాద్వైతమునందే, తిష్ఠతి = ఉండును.

**తాత్పర్యం :–** సుషుప్తి లేదా అసంసక్తి అను పంచమభూమిని అధిష్ఠించి సమస్త విశేష / వికల్ప రహితమయిన కేవల జ్ఞానరూపుడై అద్వైత దృష్టిలో నిలుచును.

---

అంతర్ముఖతయా నిత్యం బహిఽర్వృత్తిపరోఽపి సన్।
పరిశ్రాంతతయా నిత్యం నిద్రాలురివ లక్ష్యతే॥ 136

**ప్రతిపదార్థం :–**బహిర్వృత్తి పరోఽపి సన్ = బాహ్య విషయవాంఛాపరుడుగా ఉండిగూడా, నిత్యమ్ = ఎల్లపుడు, అంతర్ముఖతయా = అంతర్ముఖంగా ఉండడంచేత, నిత్యమ్ = నిత్యము, పరిశ్రాంతతయా = అలిసినవాడు కావటం చేత, నిద్రాళురివ = నిద్రపోవు వానివలె, లక్ష్యతే = కనబడును.

**తాత్పర్యం :–** లోక వ్యవహారంలో ఉంటూ ఉన్నా నిత్యం మనస్సు అంతర్ముఖంగా ఉండటం వలన బాగా అలసటవలన నిద్రమోహం వచ్చినవానిలాగా యోగి కనబడతాడు.

---

కుర్వన్నభ్యాసమేతస్యాం భూమ్యాం సమ్యగ్వివాసనః।
సప్తమీ గూఢసుప్త్యాఖ్యా క్రమప్రాప్తా పురాతనా॥ 137

**ప్రతిపదార్థం :-** ఏతస్యామ్ = ఈ ఆరవభూమికయందు, అభ్యాసమ్ = అభ్యాసమును, కుర్వన్ = చేయువాడు, సమ్యక్ = చక్కగా, వివాసనః = విషయవాసనలు గూడా లేనివాడగును. గూఢసుప్తి = గాఢసుషుప్తి అను, ఆఖ్యా = పేరుగల, పురాతనా = అత్యంత సనాతనమయిన, సప్తమీ = ఏడవదయిన తుర్యదశ, క్రమ = వరసగా, ప్రాప్తా = పొందబడినదగును.

**తాత్పర్యం :-** షష్ఠభూమిక అయిన సుషుప్తి / అసంసక్తిలో బాగా అభ్యాసం చేస్తే మనస్సులో సంస్కారరూపంగా అనగా ఇంగువకట్టిన గుడ్డలో ఇంగువ తీసినా వాసన నిలిచియున్నట్లే – ఉన్న విషయవాసనలు గూడా తొలగును. అపుడు క్రమంలో రావలసిన సప్తమ భూమిక వస్తుంది దానిపేరు గూఢసుప్తి లేదా తుర్యగా తురీయగా అనియు చెప్పవచ్చును. అది అత్యంత సనాతనమయిన శుద్ధబ్రహ్మస్థితి. నిర్వికల్పము.

---

**యత్ర నాసన్న సద్రూపో నాహం నాప్యనహంకృతిః।**
**కేవలం క్షీణమనన ఆస్తేऽద్వైతేऽతినిర్భయః॥ 138**

**ప్రతిపదార్థం :-** యత్ర = ఏ సప్తమ భూమికయందు, అసత్ = అసత్తు, న = లేదో, అహమ్ = అహం అనేది, న = లేదో, అనహం కృతిరపి = అనహంకారమున్ను, న = లేదో, కేవలమ్ = కేవలము, క్షీణ = క్షీణించిన, మననః = మననముగలవాడై, అద్వైతే = అద్వైతమునందు, అతినిర్భయః = సంపూర్ణముగా భయరహితుడై, ఆస్తే = ఉండునో, అది సప్తమభూమి.

**తాత్పర్యం :-** ఈ సప్తమ – చరమ – భూమిక నిర్వికల్ప సమాధిదశ. ఇందులో 'నీవు నేను' అను ద్వైతం ఉండదు. అంతా పరిపూర్ణమయిన ఆనందం మాత్రమే సత్తు – అసత్తు అహం – అహంకారాభావం – మనస్సు – మననం – ఏవీ ఉండవు. అంతా ఒక్కటే. అదే బ్రహ్మము. ద్వితీయం లేదు. ద్వైతం లేదు. అందువలన భయం లేదు. రెండవ వాడుంటేగదా భయం.

'ద్వితీయాద్వై భయం భవతి"

---

**అంతశ్శూన్యో బహిశ్శూన్యః శూన్యకుంభ ఇవాంబరే ।**
**అంతఃపూర్ణో బహిఃపూర్ణః పూర్ణకుంభ ఇవార్ణవే॥ 139**



**ప్రతిపదార్థం :-** అంబరే = ఆకాశమునందున్న, శూన్య కుంభ ఇవ = శూన్యకుంభములాగా, అంతఃశూన్యః = లోపల ఆకాశముగలవాడు, బహిశ్శూన్యః = బయటి ఆకాశముగలవాడు, అర్ణవే = సముద్రమునందున్న, పూర్ణ = నిండిన, కుంభ ఇవ = కడవవలె, అంతః పూర్ణః = లోపల నిండినవాడు, బహిః పూర్ణః = బయట నిండినవాడు.

**తాత్పర్యం :-** బ్రహ్మం నిరాకారం కనుక సర్వవ్యాప్తం కనుక ఆకాశం అనవచ్చును. ఆకాశమును శూన్యమని పిలుస్తారు. ఖాళీకుండ ఆకాశంలో ఉంటుంది. దానిలోపల ఆకాశమే. బయట ఆకాశమే. బ్రహ్మం జ్ఞానఘనం ఆనంద స్వరూపం పూర్ణం – అనుకుంటే అది సముద్రం వంటిది. సముద్రంలో ఉన్న పూర్ణకుంభము లోపల జలపూర్ణమే. బయట జలపూర్ణమే. కనుక సప్తమభూమిక లోనివాడు బ్రహ్మమే. పూర్ణమదః పూర్ణమిదం – అని చెప్పబడినది. అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః అన్నట్లు.

---

**మా భవ గ్రాహ్యభావాత్మా గ్రాహకాత్మా చ మా భవ।**
**భావనామఖిలాం త్యక్త్వా యచ్ఛిష్టం తన్మయో భవ॥ 140**

**ప్రతిపదార్థం :-** గ్రాహ్య = విషయగోచరమయిన, భావ = పదార్థములే, ఆత్మా = స్వరూపముగా గలవాడవు, మా భవ = కావద్దు. గ్రాహక = ఇంద్రియాలతో ప్రమాణాలతో గ్రహించే, ఆత్మా = జీవుడవున్ను, మా భవ = కావద్దు. అఖిలాం = సమస్తమయిన, భావనామ్ = భావనను, త్యక్త్వా = వదలి, యత్ = ఏది, శిష్టం = మిగిలినదో, తన్మయః = ఆ స్వరూపమువాడవు, భవ = కమ్ము.

**తాత్పర్యం :-** ప్రపంచంలోని జడపదార్థాలు దేహేంద్రియాదులు గ్రాహ్యములు. వానిని ప్రత్యక్షాది ప్రమాణాల ద్వారా గ్రహిస్తాము. కనుక అవి గ్రాహ్యములు. నీవు గ్రాహ్యములయిన శరీరేంద్రియాదులు కావు. కనుక గ్రాహ్యపదార్థములే స్వరూపము – అని భావించికొనద్దు.

---

**ద్రష్టృదర్శనదృశ్యాని త్యక్త్వా వాసనయాం సహ।**
**దర్శనప్రథమాభాసమాత్మానం కేవలం భజ॥ 141**

**ప్రతిపదార్థం :–** ద్రష్టృ = చూచే ప్రమాత అయిన జీవుని, దర్శన = జ్ఞానమును (విషయ), దృశ్యాని = విషయములను, వాసనయాసహ = సంస్కారరూపంగా ఉండే అవశేషాలతో సహ, త్యక్త్వా = వదలి, దర్శన ప్రథమ = విషయ దర్శనము మొదలగువాటిని, ఆభాసమ్ = భాసింపజేయు, ఆత్మానమ్ = ప్రత్యగాత్మను, కేవలం = మాత్రమే, భజ = సేవింపుము.

**తాత్పర్యం :–** ఇంద్రియాది ప్రమాణాలతో ద్రష్ట ప్రమాత అయిన జీవుని, వృత్తిజ్ఞానమును, దృశ్యమయిన విషయములను, వాటి మానసిక – అవశేషాలతో సహా వదలాలి. ద్రష్ట దర్శనం దృశ్యం – ఈ త్రిపుటిని భాసింపజేసే ఆత్మను సాక్షి అయిన ప్రత్యగాత్మను – సేవింపుము లేదా దర్శన ప్రథమాభాసి = జ్ఞానంయొక్క ప్రథమస్థితి అనగా నిర్వికల్పస్థితిని గ్రహింపుము.

---

## జీవన్ముక్త వర్ణన

**యథాస్థితమిదం యస్య వ్యవహారవతోఽపి చ।**
**అస్తంగతం స్థితం వ్యోమ స జీవన్ముక్త ఉచ్యతే॥ 142**

**ప్రతిపదార్థం :–** వ్యవహార = లోకవ్యవహారము, వతోఽపి చ = ఉన్నవానికయినను, యస్య = ఏ జ్ఞానికి, ఇదమ్ = ఈ, వ్యోమ = చిదాకాశము అనగా మనస్సు, అస్తంగతం = నిద్రలో అస్తమించినను, స్థితమ్ = జాగరణంలో నిలిచినను, యథాస్థితం = ఉన్నదున్నట్లుగా నుండునో, సః = వాడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడని, ఉచ్యతే = చెప్పబడును.

**తాత్పర్యం :–** వ్యవహారంలో ఉన్నా, లేకున్నా, ఎవరి హృదయాకాశం నిద్రలో లీనమయినా, జాగరణంలో మేల్కొనియున్నా అచంచలముగా బ్రహ్మాభావముతో నుండునో అతడు జీవన్ముక్తుడు.

---

**నోదేతి నాస్తమాయాతి సుఖే దుఃఖే మనఃప్రభా।**
**యథాప్రాప్తస్థితిర్యస్య స జీవన్ముక్త ఉచ్యతే॥ 143**

**ప్రతిపదార్థం :–** యస్య = ఎవనియొక్క, మనఃప్రభా = మనోజ్యోతి, సుఖే = సుఖమునందు, నోదేతి = ఉదయించదో, దుఃఖే = దుఃఖమునందు, అస్తమ్ =





అస్తమును, నాయాతి = పొందదో, యస్య = ఎవనికి, యథాప్రాప్త = ప్రాప్తమయినట్లే, స్థితిః = బ్రతుకు జరుగునో, సః = అతడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడని, ఉచ్యతే = చెప్పబడును.

**తాత్పర్యం :–** ఎవని మనస్సు సుఖంలో కాంతులీనటం, దుఃఖంలో కొడిగట్టడం ఉండదో, లభించినదానితో ఎవని పోషణ జరుగుతుందో అతడు జీవన్ముక్తుడు.

---

**యో జాగర్తి సుషుప్తిస్థో యస్య జాగ్రన్న విద్యతే।**
**యస్య నిర్వాసనో బోధః స జీవన్ముక్త ఉచ్యతే॥ 144**

**ప్రతిపదార్థం :–** యః = ఎవడు, సుషుప్తి = సుషుప్తియందున్నను, జాగర్తి = జాగరణంలో నుండునో, యస్య = ఎవనికి, జాగ్రత్ = జాగరణము, న విద్యతే = లేదో, యస్య = ఎవనికి, నిర్వాసనః = సంసార విషయ వాసనలు లేని, బోధః = జ్ఞానముగలదో, సః = అతడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడని, ఉచ్యతే = చెప్పబడును.

**తాత్పర్యం :–** జ్ఞానికి సుషుప్తి జాగరణము రెండూ లేవు. అతడు సర్వదా సాక్షిగా ఉండే కూటస్థుడయిన ప్రత్యగాత్మ. అతని జ్ఞానంలో ఎట్టి విషయవాసనలు ఉండవు. అతడు జీవన్ముక్తుడు.

---

**రాగద్వేషభయాదీనామనురూపం చరన్నపి ।**
**యోఽంతః వ్యోమవదత్యచ్ఛః స జీవన్ముక్త ఉచ్యతే॥ 145**

**ప్రతిపదార్థం :–** రాగద్వేషభయాదీనామ్ = రాగము, ద్వేషము, భయము మొదలగు వానికి, అనురూపమ్ = తగినట్లుగా, చరన్నపి = సంచరిస్తూ ఉన్నను, యః = ఎవడు, అంతః = మనస్సులో, వ్యోమవత్ = ఆకాశమువలె, అత్యచ్ఛః = అతి స్వచ్ఛమయినవాడో, సః = అతడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడుగా, ఉచ్యతే = చెప్పబడును.

**తాత్పర్యం :–** జ్ఞాని రాగద్వేషభయాదులున్నట్లుగా వ్యవహరించినా అతని మనస్సు ఆకాశంవలె స్వచ్ఛంగా ఉంటుందో అట్టివాడు జీవన్ముక్తుడు.

---

**యస్య నాహంకృతో భావః బుద్ధిర్యస్య న లిప్యతే।**
**కుర్వతోऽ కుర్వతో వాపి స జీవన్ముక్త ఉచ్యతే॥ 146**

**ప్రతిపదార్థం :–** కుర్వతః = చేయుచున్నను, అకుర్వతోవాపి = చేయకున్నను, యస్య = ఎవనికి, అహంకృతః = అహంకారము కలిగిన, భావః = భావము, న = లేదో, యస్య = ఎవనికి, బుద్ధిః = బుద్ధి, న లిప్యతే = విషయములచేత తాకబడదో, సః = అతడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడని, ఉచ్యతే = చెప్పబడును.

**తాత్పర్యం :–** కర్మలు చేసినా చేయకపోయినా ఎవనికి అహంకారము ఉండదో, ఎవని బుద్ధి కర్మదోషములతో అహంకార మమకారములతో అంటుకొనదో అతడు జీవన్ముక్తుడు.

---

**యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః।**
**హర్షామర్షభయోన్ముక్తః స జీవన్ముక్త ఉచ్యతే॥ 147**

**ప్రతిపదార్థం :–** యస్మాత్ = ఎవనినుంచి, లోకః = లోకము, నోద్విజతే = భయపడదో, యః = ఎవడు, లోకాత్ = లోకమునుండి, నోద్విజతేచ = ఉద్వేగము పొందదో, హర్ష = సంతోషముతో, అమర్ష = రోషముతో, భయ = భయముతో, ఉన్ముక్తః = విడువబడిన, సః = అతడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడని, ఉచ్యతే = చెప్పబడును.

**తాత్పర్యం :–** ఎవనిని చూచి లోకం గాభరా పడదో, ఎవడు లోకాన్ని చూచి భయపడదో అట్టి వాడు జీవన్ముక్తుడు. అతనికి రాగద్వేషములు, భయము మొదలగునవి ఉండవు.

---

**యః సమస్తార్థజాలేషు వ్యవహార్యపి శీతలః।**
**పరార్థేష్వివ పూర్ణాత్మా స జీవన్ముక్త ఉచ్యతే॥ 148**

**ప్రతిపదార్థం :–**యః = ఎవడు, సమస్త = అన్నిరకాల, అర్థజాలేషు = ప్రయోజన / కార్యసమూహములయందు, వ్యవహార్యపి = వ్యవహరించువాడయినను, పరార్థేష్వివ = పరుల వ్యవహారములయందువలె, శీతలః = చల్లగా ఉన్నవాడును, పూర్ణాత్మా = పూర్ణమయిన మనస్సుగలవాడో, సః = అతడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడుగా, ఉచ్యతే = చెప్పబడును.





**తాత్పర్యం :–** ఎదుటివారి విషయములలో ఎలా పట్టనట్లు నెమ్మదిగా చల్లగా ఉంటామో అదేవిధంగా తన సమస్త వ్యవహారాలలో ఉండేవాడు జీవన్ముక్తుడు.

---

**ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ చిత్తగతాన్ మునే!।**
**మయి సర్వాత్మకే తుష్టః స జీవన్ముక్త ఉచ్యతే॥ 149**

**ప్రతిపదార్థం :–** మునే! = నిదాఘా!, యదా = ఎపుడు, చిత్తగతా = మనస్సులో ఉన్న, సర్వాన్ = సమస్తమయిన, కామాన్ = కోరికలను, ప్రజహాతి = విడుచునో, సర్వాత్మకే = సర్వస్వరూపమయిన, మయి = ఆత్మయందు, తుష్టః = సంతృప్తి చెందిన, సః = అతడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడని, ఉచ్యతే = చెప్పబడును.

**ప్రతిపదార్థం :–** మనస్సులో ఉన్న కోరికలన్ని వదలికొని సర్వస్వరూపమయిన ఆత్మయందు ఎవడు సంతృప్తిగా ఆనందమందుకొనెనో అట్టివాడు జీవన్ముక్తుడు.

---

**చైత్యవర్జితచిన్మాత్రే పదే పరమపావనే ।**
**అక్షుబ్ధచిత్తో విశ్రాంతః స జీవన్ముక్త ఉచ్యతే॥ 150**

**ప్రతిపదార్థం :–** చైత్య = వృత్తిజ్ఞానములచేత అనగా ఖండ జ్ఞానముచేత లేదా విషయజ్ఞానముచేత, వర్జిత = వదలిపెట్టబడిన, చిన్మాత్రే = కేవల జ్ఞానరూపమయినదియు, పరమపావనే = పరమ పవిత్రమయిన, పదే = ఆత్మస్థానమునందు, అక్షుబ్ధ = కలతపడని, చిత్తః = మనసుగలవాడై, విశ్రాంతః = ఆగిపోయిన, సః = అతడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడని, ఉచ్యతే = చెప్పబడును.

**తాత్పర్యం :–** సర్వసంకల్పములు, జ్ఞానములేని కేవల జ్ఞానస్వరూపమయిన పరమ పవిత్రమయిన ఆత్మస్థానమున నిర్మలచిత్తముతో విశ్రాంతుడయినవాడు జీవన్ముక్తుడు – అని చెప్పెదరు.

---

**ఇదం జగదహం సోऽయం దృశ్యజాతమవాస్తవమ్।**
**యస్య చిత్తే న స్ఫురతి స జీవన్ముక్త ఉచ్యతే॥ 151**

**ప్రతిపదార్థం :-** ఇదమ్ = ఈ, జగత్ = ప్రపంచము, అహమ్ = నేను, సః = వాడు, అయమ్ = వీడు, అవాస్తవం = వాస్తవముగాని, దృశ్యజాతం = ఈ దృశ్యసమూహము, యస్య = ఎవనియొక్క, చిత్తే = మనస్సునందు, న స్ఫురతి = స్ఫురించదో, సః = వాడు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడని, ఉచ్యతే = చెప్పబడును.

**తాత్పర్యం :-** ఈ ప్రపంచము, నేను వాడు వీడు, అను ఈ మిథ్యారూపమయిన దృశ్య సమూహము ఎవని మనస్సులో అసలు స్ఫురించదో అతడు జీవన్ముక్తుడు.

---

**సద్బ్రహ్మణి స్థిరే స్ఫారే పూర్ణే విషయవర్జితే।**
**ఆచార్యశాస్త్రమార్గేణ ప్రవిశ్యాశు స్థిరో భవ॥ 152**

**ప్రతిపదార్థం :-** స్థిరే = శాశ్వతము, స్ఫారే = విస్తారము, పూర్ణే = పూర్ణము, విషయ = విషయములచేత, వర్జితే = శూన్యము అయిన, సద్బ్రహ్మణి = సత్తయిన బ్రహ్మమునందు, ఆచార్య = గురువు, శాస్త్ర = వేదాదిశాస్త్రముయొక్క, మార్గేణ = మార్గముద్వారా, ప్రవిశ్య = ప్రవేశించి, ఆశు = శీఘ్రముగా, స్థిరః = శాశ్వతుడవు, భవ = కమ్ము.

**తాత్పర్యం :-** సచ్చిదానంద రూపమయిన బ్రహ్మము శాశ్వతము, విస్తారము, పూర్ణము, విషయశూన్యము. గురుశాస్త్రోపదేశములద్వారా వెంటనే దానియందు ప్రవేశించి శాశ్వతుడవు కమ్ము.

---

**శివో గురుః శివో వేదః శివో దేవః శివః ప్రభుః।**
**శివోఽస్మ్యహం శివస్సర్వం శివాదన్యన్న కించన॥ 153**

**ప్రతిపదార్థం :-** శివః = శివుడు, గురుః = గురువు, శివః = శివుడు, వేదః =వేదము, శివః = శివుడు, దేవః = దేవుడు, శివః = శివుడు, ప్రభుః = ప్రభువు. అహమ్ = నేను, శివః = శివుడను, అస్మి = అగుదును. శివః = శివుడు, సర్వమ్ = సమస్తము, శివాత్ = శివునికన్న, అన్యత్ = భిన్నమయినది, కించన = కొంచెమయినను, న = లేదు.

**తాత్పర్యం :-** స్పష్టము.

---



**తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః।**
**నానుధ్యాయాద్బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్॥ 154**

**ప్రతిపదార్థం :-** ధీరః = ఇంద్రియ జయశీలుడయిన, బ్రాహ్మణః = బ్రహ్మవేత్త, తమేవ = ఆ శివునే, విజ్ఞాయ = తెలిసికొని, ప్రజ్ఞాం= ప్రజ్ఞను, కుర్వీత = చేయవలెను. బహూన్ = అనేకమయిన, శబ్దాన్ = శబ్దములను, నానుధ్యాయాత్ = తలచుచుండరాదు. తత్ = అలా తలచడం, వాచః = వాక్కుయొక్క, విగ్లాపనం హి = వాడ్చుటమే.

**తాత్పర్యం :-** ధీరుడయిన బ్రహ్మవేత్త ఆ పరమాత్మనే గ్రహించి తన ప్రజ్ఞను నిలుపవలయును. అనేక శాస్త్రవాదాదులను వదలవలెను. వాద పరిశ్రమ కేవలము వాక్కులను దుర్వినియోగముచేసి పాడు చేయటమే.

---

## శుక వామదేవమార్గములు

**శుకో ముక్తో వామదేవోఽపి ముక్తః**
**తాభ్యాం వినా ముక్తిభాజో న సంతి।**
**శుకం మార్గం యేఽనుసరంతి ధీరాః**
**సద్యోముక్తాస్తే భవంతీహ లోకే॥ 155**

**ప్రతిపదార్థం :-** శుకః = శుకమహర్షి, ముక్తః = ముక్తుడయ్యెను. వామదేవోపి = వామదేవుడున్ను, ముక్తః = ముక్తుడయ్యెను. తాభ్యాం వినా = వారు లేదా వారి మార్గము లేకుండా, ముక్తిభాజః = మోక్షంపొందిన వారు, నసంతి = లేరు. యే = ఏ, ధీరాః = జితేంద్రియములు, శుకం = శుకమను పేరుగల, మార్గం = మార్గమును, అనుసరంతి = అనుసరింతురో, తే = వారు, ఇహ లోకే = ఈ లోకమునందు, సద్యః= వెంటనే, ముక్తాః = ముక్తులు, భవంతి = కాగలరు.

**తాత్పర్యం :-** శుకవామదేవులు ముక్తాత్మలు. వారి మార్గములు రెండే మోక్షమార్గములు. సర్వముముక్షువులకు అవే మార్గాలు. శుకమార్గంలో వెళ్లువారు ఈ లోకములో సద్యోముక్తులగుదురు.

---

**వామదేవం యేఽ నుసరంతి నిత్యం**
**మృత్వా జనిత్వాచ పునః పునస్తత్।**
**తే వై లోకే క్రమముక్తా భవంతి**
**యోగైః సాంఖ్యైః కర్మభిః భక్తియుక్తైః॥ 156**

**ప్రతిపదార్థం :–** యే = ఎవరు, తత్ = ఆ, వామదేవమ్ = వామదేవుని మార్గమును, నిత్యమ్ = సదా, మృత్వా = మరణించి, జనిత్వా చ = పుట్టియూ, పునః పునః = మాటిమాటికి, అనుసరంతి = అనుసరిస్తారో, తే వై = వారు, లోకే = లోకమునందు, యోగైః = యోగములుచేత, సాంఖ్యైః = జ్ఞానములచేత, భక్తియుక్తైః = భక్తిగల, కర్మభిః = కర్మలచేత, క్రమ = వరుసతో, ముక్తాః = ముక్తులు, భవంతి = అగుదురు.

**తాత్పర్యం :–** జనన మరణాలతో, సాంఖ్యయోగభక్తికర్మలతో వామదేవమార్గము ననుసరించినవారు క్రమముగా మోక్షమును పొందెదరు.

---

**శుకశ్చ వామదేవశ్చ ద్వే సృతీ దేవనిర్మితే।**
**శుకో విహంగమః ప్రోక్తః వామదేవః పిపీలికా॥ 157**

**ప్రతిపదార్థం :–** శుకశ్చ = శుకమార్గము, వామదేవశ్చ = వామదేవమార్గము 4అని, ద్వే = రెండు, సృతీ = మార్గములు, దేవ = దేవతలచేత, నిర్మితే = నిర్మింపబడినవి. శుకః = శుకమార్గము, విహంగమః = విహంగమ (పక్షి) మార్గము. వామదేవః = వామదేవమార్గము, పిపీలికా = పిపీలికా (చీమ) మార్గము.

**తాత్పర్యం :–** ముక్తిమార్గములు రెండు. ఇవి దేవనిర్మితములు. అందు శుకమార్గము. విహంగమ మార్గము. వామదేవ మార్గము క్రమముక్తికి పనికి వచ్చు చీమలదారి.

---

**విదిత్వా స్వాత్మనో రూపమసంప్రజ్ఞాసమాధితః ।**
**శుకమార్గేణ విరజాః ప్రయాంతి పరమం పదమ్॥ 158**

**ప్రతిపదార్థం :–** అసంప్రజ్ఞా = అసంప్రజ్ఞాతమనబడు, సమాధితః = నిర్వికల్ప సమాధివలన, స్వాత్మనః = తనయొక్క, రూపమ్ = రూపమును, విదిత్వా = గ్రహించి, విరజాః = రజోరహితులై, శుకమార్గేణ = శుకమార్గంతో, పరమమ్ = పరమమయిన, పదమ్ = స్థానమును, ప్రయాంతి = పొందుదురు.



**తాత్పర్యం :–** నిర్వికల్పసమాధిలో ఎటువంటి భేదజ్ఞానము ఉండదు. కనుక అది అసంప్రజ్ఞాతము. దానిద్వారా ఆత్మజ్ఞానము పొంది విరజులై శుకమార్గంద్వారా పరమస్థానమును పొందెదరు.

---

**యమాద్యాసనజాయాసహఠాభ్యాసాత్పునఃపునః।**
**సంజాతవిఘ్నబాహుల్యః అణిమాదివశాదిహ॥ 159**
**అలబ్ధ్వాపి ఫలం సమ్యక్ పునర్భూత్వా మహాకులే ।**
**పూర్వవాసనయైవాయం యోగాభ్యాసం పునశ్చరన్॥ 160**
**అనేకజన్మాభ్యాసేన వామదేవేన వై పథా ।**
**సోఽపి ముక్తిం సమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్॥ 161**

**ప్రతిపదార్థం :–** పునఃపునః = మాటిమాటికి, యమాది = యమనియమాలు మొదలుగా, ఆసనజ = ఆసనములు మొదలగువానివలన పుట్టిన, ఆయాస = శ్రమగల, హఠ = హఠయోగముయొక్క, అభ్యాసాత్ = అభ్యాసంవలన, అణిమాది = అణిమాది సిద్ధులయొక్క, వశాత్ = వశంవలన, ఇహ = ఈ లోకమునందు, సంజాత = కలిగిన, విఘ్నబాహుళ్యః = బహువిఘ్నములుగలవాడై, ఫలమ్ = ఫలితమును, సమ్యక్ = చక్కగా, అలబ్ధ్వాపి = పొందక, పునః = మరల, మహాకులే = గొప్ప వంశమున, భూత్వా = జన్మించి, అయమ్ = ఈ యోగభ్రష్టుడు లేదా అసంపూర్ణయోగి, పూర్వ = పూర్వజన్మసంబంధమయిన, వాసనయైవ = సంస్కారము చేతనే, పునః = మరల, యోగాభ్యాసమ్ =యోగాచరణను, చరన్ = ఆచరించుచు, అనేక = చాల, జన్మ = జన్మలకు సంబంధించిన, అభ్యాసేన = అభ్యాసముచేత, వామదేవేన వై = వామదేవసంబంధమయిన, పథా = మార్గముచేత, సోఽపి = అట్టిముముక్షువుగూడా, ముక్తిమ్ = మోక్షమును, సమాప్నోతి = పొందును. తత్ = అది, విష్ణోః = విష్ణువుయొక్క, పరమమ్ = పరమమయిన, పదమ్ = స్థానము.

**తాత్పర్యం :–** మాటిమాటికి యమనియమాదులు, హఠయోగము, ఆసనాలు మొదలగునవి ఆచరించటంవలన శరీరంలో ఆరోగ్య సంబంధమయిన విఘ్నాలు వస్తాయి. అణిమాదిసిద్ధులు లభించటంవలన లోకంలో కీర్తి, ధ్యానము మొదలగునవి సంపాదించే వ్యసనాలు విఘ్నరూపంగా వస్తాయి. ఈ విఘ్నాలవలన ఆ జన్మలో

ఫలితం పొందలేరు. యోగభ్రష్టులవుతారు. లేదా అసంపూర్ణ యోగులు దారితప్పిన యోగులవుతారు. వారు శుద్ధులయిన శ్రీమంతుల యింట పుట్టారు. పూర్వజన్మ సంస్కారం వలన మరల వారిలో యోగవిద్య మొదలవుతుంది. ఇలా అనేక జన్మలలో వంతుల వారీగా ఏర్పడిన యోగఫలంతో 'చీమ – పద్ధతిలో' వామదేవమార్గమున మోక్షము పొందును. ఇది క్రమముక్తి. వారు విష్ణుపరమపదమును పొందగలరు. విష్ణువు – అంటే సర్వవ్యాపి అయిన బ్రహ్మమే.

---

**ద్వావిమావపి పంథానౌ బ్రహ్మప్రాప్తికరౌ శివౌ।**

**సద్యోముక్తిప్రదశ్చైకః క్రమముక్తిప్రదః పరః॥ 162**

**ప్రతిపదార్థం :–** ఇమౌ = ఈ, పంథానౌ = మార్గములు (శుకవామదేవ) ద్వౌ అపి = రెండున్నూ, శివౌ = మంగళమయినవి. బ్రహ్మప్రాప్తి = బ్రహ్మలాభమును, కరౌ = చేయునవి. ఏకః = అందులో ఒకటి, సద్యోముక్తి = తత్‌క్షణముక్తిని, ప్రదశ్చ = ఇచ్చునది. పరః = మరొకటి, క్రమముక్తి = క్రమంగా ముక్తిని, ప్రదః = ఇచ్చునది.

**తాత్పర్యం :–** ఈ రెండు మార్గాలు మంగళమయినవే. అవి బ్రహ్మప్రాప్తిని కల్గించును. అందులో శుకమార్గము సద్యోముక్తి ప్రదము. వామదేవ మార్గము క్రమముక్తి నిచ్చును.

---

**తత్ర కో మోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః ।**

**యస్యానుభవపర్యంతా బుద్ధిస్తత్త్వే ప్రవర్తతే॥ 163**

**ప్రతిపదార్థం :–** యస్య = ఎవనియొక్క, బుద్ధిః = బుద్ధి, అనుభవపర్యంతా = అనుభవం వచ్చేదాకా, తత్త్వే = తత్త్వమునందు, ప్రవర్తతే = ప్రవర్తించునో, తత్ర =ఆ తత్త్వమునందు, ఏకత్వమ్ = ఏకతత్త్వమును, అనుపశ్యతః = చూచుచున్నవానికి, మోహః = అజ్ఞానము, కః = ఏది? శోకః = శోకము, కః = ఏది?

**తాత్పర్యం :–** ఎవని బుద్ధి అనుభవం వచ్చేదాకా తత్త్వం మీదనే సాగుతుందో, అతనికి – ఏకత్వదర్శనమవుతుంది. అట్టివానికి ఆ ఏకత్వస్థితిలో ఇక మోహం ఎక్కడిది? శోకం ఎక్కడిది?



**తద్దృష్టిగోచరాస్సర్వే ముచ్యంతే సర్వపాతకైః ।**

**ఖేచరా భూచరాస్సర్వే ముచ్యంతే సర్వపాతకైః॥**

**సద్య ఏవ విముచ్యంతే కోటిజన్మార్జితైరఘైః॥ 164**

**ప్రతిపదార్థం :–** తత్ = బ్రహ్మవేత్తయొక్క, దృష్టి = దృష్టికి, గోచరాః = అందిన, సర్వే =అందరూ, సర్వ = సమస్తమయిన, పాతకైః = పాపములచేత, ముచ్యంతే = విడువబడుదురు. ఖేచరాః = ఆకాశచారులయిన దేవజాతులు, భూచరాః = భూలోకచారులయిన జాతులు, సర్వే = అందరును, సర్వపాతకైః = సమస్త పాపములచేత, ముచ్యంతే = విడువబడుదురు. కోటిజన్మ = అనేక జన్మలనుండి, ఆర్జితైః = సంపాదింపబడిన, అఘైః = పాపములచేత, సద్య ఏవ = వెంటనే, విముచ్యంతే = విడువబడును.

**తాత్పర్యం :–** బ్రహ్మవేత్త దృష్టిపరిధిలో పడిన వారందరు వారు భూచరులయినా ఖేచరులయినా కోటిజన్మ పాపాలనుండి అయినా తత్‌క్షణమే ముక్తి పొందగలరు.

**ఇది చతుర్థాధ్యాయము**

---

# పంచయోऽధ్యాయః

**అథ హైనమ్ ఋభుం భగవంతం నిదాఘః పప్రచ్ఛ**
**యోగాభ్యాసవిధిమనుబ్రూహీతి। తథేతి స హోవాచ** **165**

**తాత్పర్యం :–** తరువాత భగవాన్ ఋభుమహర్షిని నిదాఘుడు, యోగాభ్యాస విధానం చెప్పవలసినదని అడిగెను. ఆయన అలాగేనని చెప్పెను.

---

## హఠయోగవిధానము

**పంచభూతాత్మకో దేహః పంచమండలపూరితః ।**
**కాఠిన్యం పృథివీ హ్యేషా పానీయం తద్ద్రవాకృతి॥** **166**
**దీపనం చ భవేత్ తేజః ప్రచారో వాయులక్షణమ్।**
**ఆకాశః సత్త్వతః సర్వం జ్ఞాతవ్యం యోగమిచ్ఛతా॥** **167**

**ప్రతిపదార్థం :–** దేహః = దేహము, పంచభూత = పంచభూతాలు, ఆత్మకః = స్వరూపముగాగలది, పంచమండల = పంచకోశములచేత, పూరితః = నిండినది. కాఠిన్యమ్ = కఠినత్వం, ఏషా = ఈ, పృథివీ హి = భూమిగదా! పానీయమ్ = జలము, తత్ = ఆ, ద్రవాకృతి = ద్రవాకారముగలది, దీపనంచ = వేడి వెలుగు కలిగించేది, తేజః = అగ్ని, భవేత్ = అగును. ప్రచారః = కదలిక, వాయులక్షణమ్ = వాయువుయొక్క చిహ్నము. సత్త్వతః = ఉనికివలన, ఆకాశః = ఆకాశము, సర్వం = ఇదంతయు, యోగమ్ = యోగమును, ఇచ్ఛతా = కోరువానిచేత, జ్ఞాతవ్యమ్ = తెలిసికొనదగినది.

**తాత్పర్యం :–** దేహం పంచభూతాల సమన్వయంతో ఏర్పడినది. దీనియందు పంచమండలములు అనగా పంచకోశములు, లేదా పంచ చక్రములు ఉన్నాయి. శరీర కాఠిన్యం పృథివీలక్షణము. ద్రవాలు జల లక్షణము. దీప్తి వేడి – అగ్ని లక్షణము. కదలిక వాయులక్షణము. సత్త్వము అనగా లోపల ఉన్న ఖాళీ ఆకాశతత్త్వము. యోగి కాదలచిన వాడు ఇదంతా గ్రహించాలి.





మిగిలిన భూతాలు వాటి ఆకారము మార్చినవి. కాని ఆకాశం ఎచ్చటనయినా అలాగే ఉంటుంది. అందువలన ఆకాశ లక్షణము. సత్త్వము అనగా ఆకాశంగా ఖాళీగా ఉండటమే.

ఇందులో పాఠము 'పృథివీమేకా' అని ఉన్నది. పాఠాంతరము 'పృథివీ హ్యేషా' అని ఉన్నది. ఇదే సమన్వయం అవుతున్నది. అందువలన పాఠాంతరమే తీసికొన్నాను.

---

**షట్ఛతాన్యధికాన్యత్ర సహస్రాణ్యేకవింశతిః।**
**అహోరాత్రవహైః శ్వాసైః వాయుమండలఘాతకః॥** **168**

**ప్రతిపదార్థం :–** అత్ర = ఇచ్చట, ఏకవింశతిః = 21, సహస్రాణి = వేలు, అధికాని = దానికి పైన, షట్ఛతాని = 600, అయిన అహోరాత్ర = రేయింబవళ్ళు, వహైః = ప్రవహించు, శ్వాసైః = శ్వాసలచేత, వాయుమండల = ప్రాణమండలమును, ఘాతకః = కొట్టును.

**తాత్పర్యం :–** ప్రతి నరుడు అహోరాత్ర సమయంలో తీసికొను శ్వాసలు 21, 600.

---

**తత్పృథ్వీమండలే క్షీణే వలిరాయాతి దేహినామ్ ।**
**తద్వదాపోగణాపాయే కేశాః స్యుః పాండరాః క్రమాత్॥** **169**

**ప్రతిపదార్థం :–** తత్ = దేహంయొక్క, పృథ్వీమండలే = భూమండలము, క్షీణే = తగ్గగా, దేహినామ్ = దేహధారులకు, వలిః = ముడుత, ఆయాతి = వచ్చును. తద్వత్ = అలాగే, ఆపోగణ = జలమండలముయొక్క, అపాయే = తగ్గుదలలో, కేశాః = తలవెంట్రుకలు, క్రమాత్ = క్రమముగా, పాండరాః = తెల్లనివిగా, స్యుః = అగును.

**తాత్పర్యం :–** దేహంలో పృథ్వీమండలం బలం తగ్గితే దేహధారులకు ముడతలు వస్తాయి. జలమండలం ఆరిపోతుంటే వెంట్రుకలు నెరుస్తాయి.

---

**తేజఃక్షయే క్షుధా కాంతిర్నశ్యతే మారుతక్షయే।**
**వేపథుః సంభవేన్నిత్యం నాభసే నైవ జీవతి ॥**
**ఇత్థంభూతక్షయాన్నిత్యం జీవితం భూతధారణమ్ ।** **170**

**ప్రతిపదార్థం :–** తేజః = తేజోమండలంయొక్క, క్షయే = తరుగుదలలో, క్షుధా = ఆకలి, కాంతిః = కాంతి, నశ్యతే = నశించును. మారుత = వాయుమండలము యొక్క, క్షయే = క్షయమునందు, నిత్యమ్ = నిత్యము, వేపథుః = వణుకు, సంభవేత్ = కలుగును. నాభసే = ఆకాశమండలము నశిస్తే, నైవ జీవతి = బ్రతకనే బ్రతుకడు. భూత = పంచభూతములయొక్క, క్షయాత్ = తరుగుదలవలన, ఇత్థమ్ = ఇలా జరుగును, జీవితమ్ = జీవితము, నిత్యమ్ = సదా, భూత = పంచభూతములయొక్క, ధారణము = నిలుపుకొనుటయే.

**తాత్పర్యం :–** అగ్నిమండలం క్షయిస్తే ఆకలి, కాంతి తగ్గినవి. వాయుమండలం తగ్గితే శరీరంలో వణుకు వస్తుంది. ఆకాశ మండలం తగ్గితే అసలు మనిషే బ్రతకడు. భూతక్షయం వలన ఇలా జరుగుతున్నది. కనుక జీవితమంటే భూత ధారణమే.

---

**ఉద్యాణం కురుతే యస్మాదవిశ్రాంతం మహాఖగః।**
**ఉడ్డియాణం తదేవ స్యాత్ తత్ర బంధోఽభిధీయతే।** **171**

**ప్రతిపదార్థం :–** యస్మాత్ = దేనినుండి, మహాఖగః = మహాపక్షి అయిన ప్రాణము, అవిశ్రాంతమ్ = నిరంతరము, ఉద్యాణం = ఎగురుటను, కురుతే = చేయునో, తదేవ = ఆ స్థానమే, ఉడ్డియాణం = ఉడ్డియాణము, స్యాత్ = అగును. తత్ర = అచ్చట, బంధః = ఉద్యాణ బంధము, విధీయతే = విధింపబడుచున్నది.

**తాత్పర్యం :–** ఉద్యాణ బంధము ఇది నడుమువద్ద వడ్డాణము పెట్టుకొనే చోట చేసే బంధము. నాభివద్ద నుంచి ప్రాణపక్షి ఎగురుతూ దిగుతూ ఉండే చోటు గనుక దీనిని 'ఉడ్డియాణం' అంటారు. ఉత్ + దయనం = పైకి ఆకాశములో ఎగురుట అని అర్థము. (అందుకే అక్కడ పెట్టికొనే నగ ఒడ్డాణము, వడ్డాణము లలితా సహస్రనామాలలో చెప్పిన ఓడ్యాణపీఠం ఇచ్చటదే.)

---



**ఉడ్డియాణో హ్యసౌ బంధో మృత్యుమాతంగకేసరీ।**
**తస్య ముక్తిః తనోః కాయాత్ తస్య బంధో హి దుష్కరః ।** **172**

**ప్రతిపదార్థం :–** అసౌ = ఈ, ఉడ్డియాణః = ఉద్యాణమనే, బంధః = బంధము, మృత్యు = మృత్యువనే, మాతంగ = ఏనుగుకు, కేసరీ = సింహము, హి = కదా, తస్య = ఆ బంధమునకు, తనోః = సన్నని, కాయాత్ = శరీరమువలన, ముక్తిః = ముక్తి అగును. తస్య = ఉద్యాణముయొక్క, బంధః = బంధము, దుష్కరః = చేయ శక్యము కానిది.

**తాత్పర్యం :–** ఈ ఉద్యాణ బంధము మృత్యువును పరిహరించును. సూక్ష్మ శరీరమునుండి దీనికి ముక్తి లభించును. ఈ బంధము చేయటం చాలా కష్టము.

---

**అగ్నౌ తు చలితే కుక్షౌ వేదనా జాయతే భృశమ్।**
**న కార్యా క్షుధితేనాపి నాపి విణ్మూత్రవేగినా।**
**హితం మితం చ భోక్తవ్యం స్తోకంస్తోకమనేకధా।** **173**

**ప్రతిపదార్థం :–** అగ్నౌ = అగ్ని, చలితే = ఈ బంధం వలన కదిలితే, కుక్షౌ = పొట్టయందు, వేదనా = బాధ, భృశమ్ = మిక్కిలి, జాయతే = పుట్టును. క్షుధితేనాపి = ఆకలిగా ఉన్నవానిచేత, న కార్యా = చేయదగినది కాదు. విణ్మూత్ర = మలమూత్రములకు సంబంధించిన, వేగినాపి = తొందరగలవాని చేతగూడా, న = చేయదగినది కాదు, హితమ్ = హితమయినది, మితం చ = మితమయినది, స్తోకం స్తోకం చ = కొద్దికొద్దిగా, అనేకధా = అనేకసార్లు, భోక్తవ్యమ్ = భోజనము చేయదగును.

**తాత్పర్యం :–** ఉద్యాణబంధాసనము వేసినవాడు చాలా జాగ్రతగా నుండవలయును. దీనివలన పొట్టలో అగ్ని వృద్ధి పొందును. దాని కదలిక వలన ఆకలి పెరుగును. పొట్టలో బాధ కలుగును. కనుక బాగా ఆకలి ఉన్నపుడు చేయరాదు. మలమూత్రాల అవసరమును ఆపి యీ ఆసనము వేయరాదు. తిండిగూడా హితంగానూ మితంగానూ ఉండాలి. దానినిగూడా ఒక్కసారిగా తినకుండా కొంచెం కొంచెం చాలాసార్లుగా తినవలెను.

---

**మృదుమధ్యమమంత్రేషు క్రమాన్మంత్రం లయం హఠమ్।**

**లయమంత్రహఠా యోగాః యోగో హ్యష్టాంగసంయుతః॥ 174**

**ప్రతిపదార్థం :-** మృదు = లయము, మధ్యమ = హఠము, మంత్రేషు = మంత్రములయందు, క్రమాత్ = వరసగా, మంత్రం = మంత్రమును, లయమ్ = లయమును, హఠమ్ = హఠమును, లయ = లయము, మంత్ర = మంత్రము, హఠాః = హఠము అనునవి, యోగాః = యోగములు. యోగః = యోగము, అష్టాంగ = అష్టాంగములతో, సంయుతః = కూడినది, హి = కదా!

**తాత్పర్యం :-** మూడురకాల వరసలలో ఈ యోగాలను ఆచరిస్తారు. 1. లయ హఠనాద (మంత్ర) యోగము 2. నాదలయ హఠ యోగములు 3. లయనాద హఠ యోగములు.

ఈ యోగములకు అష్టాంగములు గలవు.

మంత్రయోగము = నాదయోగము, ప్రణవ / తారకయోగము అన్ని నాదమూల మయిన యోగములు.

---

## అష్టాంగములు

**యమశ్చ నియమశ్చైవ తథా చాసనమేవ చ।**

**ప్రాణాయామస్తథా పశ్చాత్ ప్రత్యాహారస్తథా పరమ్॥**

**ధారణా చ తథా ధ్యానం సమాధిశ్చాష్టమో భవేత్। 175**

**తాత్పర్యం :-**యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి – అని ఎనిమిది యోగాంగములు.

---

**అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యం దయార్జవమ్॥**

**క్షమా ధృతిర్మితాహారః శౌచం చేతి యమా దశ। 176**

**తాత్పర్యం :-** అహింస, సత్యము, అస్తేయము (దొంగతనం చేయకపోవటం), బ్రహ్మచర్యము, దయ, ఆర్జవము, (కపటం లేకుండా ఉండటం) క్షమ, ధృతి, మితాహారము, శౌచము – ఇవి '10' యమములు.





**తపః సంతోషమాస్తిక్యం దానమీశ్వరపూజనమ్॥**

**సిద్ధాంతశ్రవణం చైవ హ్రీః మతిశ్చ జపో వ్రతమ్।**

**ఏతే హి నియమాః ప్రోక్తాః దశధైవం మహామతే॥ 177**

**తాత్పర్యం :-** తపస్సు, సంతోషము, ఆస్తికత్వము, దానము, ఈశ్వరపూజ, సిద్ధాంతగ్రంథం వినటం, హ్రీ = సిగ్గు, తప్పుడు పనులు చేయటానికి సిగ్గుపడటం, మతి (శాస్త్ర సంస్కారంగల బుద్ధి) జపము, వ్రతము (సత్యవ్రతము దానవ్రతము మొదలగునవి ఈ 10 నియమాలు.

---

**ఏకాదశాసనాని స్యుః చక్రాద్యా మునిసత్తమ ।**

**చక్రం పద్మాసనం కూర్మం మయూరం కుక్కుటం తథా॥**

**వీరాసనం స్వస్తికం చ భద్రం సింహాసనం తథా।**

**ముక్తాసనం గోముఖం చ కీర్తితం యోగవిత్తమైః॥ 178**

**తాత్పర్యం :-** చక్రాసనము మొదలుగా 11 ఆసనాలున్నాయి. చక్రాసనం, పద్మాసనం అలాగే, కూర్మ, మయూర, కుక్కుట, వీర, స్వస్తిక, భద్ర, సింహ, ముక్త గోముఖాసనములు మొత్తం 11 యోగాసనములు యోగులు చెప్పినవి.

---

**సవ్యోరు దక్షిణే గుల్ఫే దక్షిణం దక్షిణోత్తరే।**

**నిదధ్యాదృజుకాయస్తు చక్రాసనమిదం మతమ్॥ 179**

**ప్రతిపదార్థం :-** సవ్యోరు = ఎడమతొడను, దక్షిణే = కుడి, గుల్ఫే = చీలమండ యందు, దక్షిణమ్ = కుడి తొడను, దక్షిణోత్తరే = ఎడమ చీలమండ యందు, నిదధ్యాత్ = పెట్టవలయును. తు = కాని, ఋజు = వంకరలేని, కాయః = శరీరము గలవాడై యుండవలయును. ఇదమ్ = ఇది, చక్రాసనమ్ = చక్రాసనమని, మతమ్ = చెప్పబడినది.

**తాత్పర్యం :-** ఎడమతొడను, కుడిచీలమండలోనికి, కుడితొడను ఎడమ చీలమండలోనికి అమర్చవలయును. యోగి సాఫుగా నిటారుగా కూర్చొనవలయును. ఇది చక్రాసనము.

## ప్రాణాయామము

**పూరకః కుంభకః తద్వద్రేచకః పూరకః పునః।**
**ప్రాణాయామః స్వనాడీభిః తస్మాన్నాడీః ప్రచక్షతే॥ 180**

**ప్రతిపదార్థం :–** స్వనాడీభిః = తన నాడులచేత, పూరకః = పూరకమని, కుంభకః = కుంభకమని, తద్వత్ = అలాగే, రేచకః = రేచకమని, పునః = మరల, పూరకః = పూరకమని, ప్రాణాయామః = ప్రాణాయామమంటారు. తస్మాత్ = అందువలన, నాడీః = నాడులను, ప్రచక్షతే = చెప్పుచున్నారు.

**తాత్పర్యం :–** ప్రాణాయామము తన నాడులతో ( ఇదా, పింగళా, సుషుమ్నా) పూరకము, కుంభకము, రేచకము మరల పూరకము. అని నాల్గుగా చేయవలయును. అందువలన నాడుల గురించి చెప్తున్నారు.

---

**శరీరం సర్వజంతూనాం షణ్ణవత్యంగులాత్మకమ్।**
**తన్మధ్యే పాయుదేశాత్తు ద్వ్యంగులాత్పరతః పరమ్॥**
**మేఢ్రదేశాదధస్తాత్తు ద్వ్యంగులాన్మధ్యముచ్యతే। 181**

**ప్రతిపదార్థం :–** సర్వజంతూనామ్ = సర్వజీవులయొక్క, శరీరమ్ = శరీరము, షణ్ణవతి = 96, అంగులాత్మకమ్ = అంగుళాలుంటుంది (ఇది సాధారణ ప్రమాణము) తన్మధ్యే = ఆ శరీరం మధ్యలో, పాయుదేశాత్తు = ముడ్డినుండి, పరతః = అవతల, ద్వ్యంగులాత్ = రెండంగుళములకన్న, పరం = అవతల, మేఢ్రదేశాత్ = లింగ ప్రదేశమునుండి, అధస్తాత్ = క్రిందగా, ద్వ్యంగులాత్ = రెండంగుళాల క్రింద, 'మధ్యమ్' = మధ్యము అని, ఉచ్యతే = చెప్పబడును.

**తాత్పర్యం :–** సమస్త జీవులకు శరీరం "96" అంగుళాలు సాధారణము. దాని మధ్యలో ముడ్డినుండి రెండంగుళాలుపైన, లింగమునుండి రెండంగుళాలు క్రిందగానున్న ప్రాంతము 'మధ్యం' అందురు. అది 'గుద – లింగ' మధ్యము.

---

**మేఢ్రాన్నవాంగులాదూర్ధ్వం నాడీనాం కందముచ్యతే॥**
**చతురంగులముత్సేధం చతురంగులమాయతమ్।**
**అండాకారం పరివృతం మేదోమజ్జాస్థిశోణితైః॥ 182**





**ప్రతిపదార్థం :–** మేఢ్రాత్ = లింగమునుండి, నవాంగులాత్ = 9 అంగుళములకన్న, ఊర్ధ్వమ్ = పైన, నాడీనామ్ = నాడులయొక్క, కందం = దుంప, ఉచ్యతే = ఉన్నదని చెప్పబడును. చతురంగులం = నాల్గు అంగుళాలు, ఉత్సేధం = ఎత్తు, చతురంగులమ్ = నాల్గు అంగుళాలు, ఆయతం = వెడల్పుగా ఉన్న, అండాకారః = కోడిగ్రుడ్డు ఆకారముగల, కందము, మేదః = కొవ్వుచేత, మజ్జ = మూలగచేత, అస్థి = ఎముకలచేత, శోణితైః = నెత్తురుచేత, పరివృతం = క్రమ్ముకొనబడినదిగా ఉండును.

**తాత్పర్యం :–** లింగమునుండి 9 అంగుళములపైన నాడీ కందమున్నది. అది ఎత్తు వెడల్పు నాల్గు నాల్గు అంగుళములు. ఒక గ్రుడ్డువలె నుండును. దానికి చుట్టు క్రొవ్వు, మూలగ, ఎముక, నెత్తురులుండును.

---

## నాడీచక్రము – బంధములు

**తత్రైవ నాడీచక్రం తు ద్వాదశారం ప్రతిష్ఠితమ్।**
**శరీరం ధ్రియతే యేన వర్తతే తత్ర కుండలీ॥**
**బ్రహ్మరంధ్రం సుషుమ్నా యా వదనేన పిధాయ సా । 183**

**ప్రతిపదార్థం :–** తత్రైవ = ఆ కందమందే, ద్వాదశారమ్ = 12 దళములు / ఆకులుగల, నాడీచక్రం తు = నాడీచక్రము, ప్రతిష్ఠితమ్ = భగవంతునిచేత ఉంచబడినది. యేన = దేనిచేత (దానిచేత) శరీరమ్ = శరీరము, ధ్రియతే = ధరింపబడుచున్నది. తత్ర = అచ్చట, కుండలీ = కుండలిని, వర్తతే = ఉన్నది, యా = ఏ నాడి, వదనేన = తన నోటితో, బ్రహ్మరంధ్రమ్ = బ్రహ్మ ద్వారమును, పిధాయ = కప్పి ఉన్నదో, సా = అది కుండలిని.

**తాత్పర్యం :–** మూలకందమునందే నాడీచక్రమున్నది. దానికి ఆకులు 12 కలవు. ఆ చక్రమే ఈ శరీరాన్ని పట్టి నిలుపుతుంది. దానియందు మహాశక్తి కుండలినియున్నది. అందులో బ్రహ్మరంధ్రమును నోటితో కప్పి ఉంచినదే సుషుమ్నా నాడి.

---

**అలంబుసా సుషుమ్నాయాః కుహూర్నాడీ వసత్యసౌ॥**

**అనంతరారయుగ్మే తు వారుణా చ యశస్వినీ।**

**దక్షిణారే సుషుమ్నాయాః పింగలా వర్తతే క్రమాత్॥ 184**

**ప్రతిపదార్థం** :- సుషుమ్నాయాః = సుషుమ్నా సమీపంలో, అలంబుసా = అలంబుసనాడి, అసౌ = ఈ, కుహూర్నాడీ = కుహునాడి, వసతి = ఉండును, అనంతర = తరువాతదయిన, అరయుగ్మె తు = ఆకుల జంటలో, వారుణా చ = వారుణీనాడియు, యశస్వినీ = యశస్వినీ నాడియు, సుషుమ్నాయాః = సుషుమ్నయొక్క, దక్షిణారే = కుడి ఆకునందు, క్రమాత్ = క్రమముగా, పింగలా = పింగలానాడి, వర్తతే = ఉండును.

**తాత్పర్యం :-** సుషుమ్నా నాడివద్ద అలంబుస, కుహూనాడి ఉండును. తరువాత ఉన్న జంట ఆకులలో వారుణ, యశస్విని అను నాడులున్నాయి. సుషుమ్నకు కుడి ఆకునందు పింగలానాడి యుండును.

---

**తదంతరారయోః పూషా వర్తతే చ పయస్వినీ।**

**సుషుమ్నా పశ్చిమే చారే స్థితా నాడీ సరస్వతీ॥ 185**

**శంఖినీ చైవ గాంధారీ తదనంతరయోః స్థితే।**

**ఉత్తరే తు సుషుమ్నాయా ఇడాఖ్యా నివసత్యసౌ॥**

**అనంతరం హస్తిజిహ్వా తతో విశ్వోదరీ స్థితా। 186**

**తాత్పర్యం :-**దాని వెంబడి ఉన్న ఆకులలో పూషానాడి, పయస్వినీనాడి, సుషుమ్నకు పశ్చిమంగా ఆకులో సరస్వతీనాడి, దాని తరువాత ఆకులలో శంఖినీ నాడి, గాంధారీనాడి సుషుమ్నకు ఉత్తరంగా ఇడానాడి, దానితరువాత హస్తిజిహ్వానాడి, విశ్వోదరీనాడి ఉన్నవి.

---

**ప్రదక్షిణక్రమేణైవ చక్రస్యారేషు నాడయః॥**

**వర్తంతే ద్వాదశ హ్యేతా ద్వాదశానిలవాహికాః॥ 187**





**ప్రతిపదార్థం :-** చక్రస్య = చక్రముయొక్క, అరేషు = ఆకులయందు, నాడయః = నాడులు, ప్రదక్షిణక్రమేణైవ = ప్రదక్షిణ క్రమంతోనే, వర్తంతే = ఉండును. ఏతాః = ఈ, ద్వాదశ = 12 నాడులు, ద్వాదశ = 12 రకాలయిన, అనిల = వాయువులను, వాహికాః = మోయునట్టివి.

**తాత్పర్యం :-** ఈ '12' నాడులు ఈ చక్రములో ప్రదక్షిణ క్రమంతో ఉన్నవి. ఇవి '12' వాయువులను నడుపును.

---

**పటవత్సంస్థితా నాడ్యో నానావర్ణాః సమీరితాః॥**

**పటమధ్యం తు యత్ స్థానం నాభిచక్రం తదుచ్యతే। 188**

**ప్రతిపదార్థం :-** పటవత్ = వస్త్రమువలె, సంస్థితాః = ఉన్న, నాడ్యః = నాడులు, నానావర్ణాః = చాలారంగులు గలవిగా, సమీరితాః = చెప్పబడినవి. పటమధ్యమ్ = వస్త్రమధ్యంలో ఉన్న, స్థానమ్ = స్థానము, యత్ = ఏదిగలదో, తత్ = అది, నాభిచక్రం = నాభిచక్రమని, ఉచ్యతే = చెప్పబడును.

**తాత్పర్యం :-** నాడులన్ని వస్త్రతంతువువలె నానావర్ణములు గలవిగా నున్నవి. వస్త్రమధ్యంలో ఉన్న స్థానమును నాభి చక్రమందురు.

---

**నాదాధారా సమాఖ్యాతా జ్వలంతీ నాదరూపిణీ॥**

**పరరంధ్రా సుషుమ్నా చ చత్వారో రత్నపూరితాః॥ 189**

(188,189 ఇవి ఒక పాఠంలో లేవు. వీటి అవసరం అంతగా కనబడదు. మొదట్లో నాడీచక్రం అన్నదానిని ఇక్కడ నాభిచక్రం అంటున్నాడు. సుషుమ్నవద్ద చత్వారః అన్నాడు. ఆ నాల్గు ఏమిటో ఇవ్వలేదు. కనుక మరేదయినా ఉపనిషత్తునుంచి యీ శ్లోకాలు ఇందులోకి వచ్చాయేమో?)

**ప్రతిపదార్థం :-** సుషుమ్నా చ = సుషుమ్న, నాదాధారా = నాదాధారమయినదిగాను, నాదరూపిణీ = నాదరూపముగలదయి, జ్వలంతీ చ = ప్రకాశించుచున్నదిగాను, పరరంధ్రా = అత్యంత సూక్ష్మమయిన బెజ్జముగలదిగాను, సమాఖ్యాతా = చెప్పబడినది. చత్వారః = ఈ నాల్గురకములు, రత్నపూరితాః = రత్నములతో నిండినవి.

**తాత్పర్యం :-** ముందు చెప్పబోవు భాగాన్ని బట్టి సుషుమ్న అగ్నిగర్భ, బ్రహ్మగర్భ లేదా జ్ఞానగర్భ. వాయు, వహ్ని, బిందునాదములుద్భవించును. అలాగే పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపమయిన నాదభాగములు నాల్గు జ్ఞానగర్భమయినవి ఉన్నవి. నాదము జ్యోతిరూపంగా మారుతుంది గనుక రత్నమనీ చెప్పవచ్చును. మొత్తంమీద సుషుమ్నా భాగములు నాల్గు. రత్నములతో నిండినవి.

---

**కుండల్యా పిహితం శశ్వత్ బ్రహ్మరంధ్రస్య మధ్యమమ్॥**
**ఏవమేతాసు నాడీషు చరంతి దశ వాయవః ।** **190**

**ప్రతిపదార్థం :-** కుండల్యా = కుండలినీశక్తిచేత, బ్రహ్మరంధ్రస్య = బ్రహ్మరంధ్రము యొక్క, మధ్యమమ్ = రంధ్రము / మధ్యభాగము, శశ్వత్ = ఎల్లపుడు, పిహితమ్ = కప్పివేయబడినది. ఏవమ్ = ఈవిధముగా, ఏతాసు = ఈ, నాడీషు = నాడుల యందు, దశ = 10, వాయవః = వాయువులు, చరంతి = సంచరించును.

**తాత్పర్యం :-** కుండలినీ నాడి బ్రహ్మరంధ్రమును (మూలకందములో ఉండే బ్రహ్మమార్గమయిన అతి సన్నటి రంధ్రమును) తన నోటితో కప్పియుండును. ఈ విధముగా దశవాయువులు ఈ నాడులలో సంచరించుచుండును.

---

**ఏవం నాడీగతిం వాయుగతిం జ్ఞాత్వా విచక్షణః॥**
**సమగ్రీవశిరఃకాయః సంవృతాస్యః సునిశ్చలః ।** **191**
**నాసాగ్రే చైవ హృన్మధ్యే బిందుమధ్యే తురీయకమ్॥**
**స్రవంతమమృతం పశ్యేత్ నేత్రాభ్యాం సుసమాహితః।** **192**

**ప్రతిపదార్థం :-** ఏవమ్ = ఈ విధంగా, నాడీగతిమ్ = నాడీమార్గమును, వాయుగతిమ్ = వాయుగమనమును, జ్ఞాత్వా = ఎరిగి, విచక్షణః = వివేచనగలవాడై, సమ = సమానంగా నిటారుగా, ఉన్న, గ్రీవ = మెడ, శిరః = తల, కాయః = శరీరముగలవాడై, సంవృతాస్యః = నోరుమూసికొన్నవాడై, సునిశ్చలః = నిశ్చలుడై, నాసాగ్రే = ముక్కుచివర, హృన్మధ్యే = హృదయమధ్యమున, బిందుమధ్యే = మనోమధ్యమున, అమృతమ్ = అమృతమును, స్రవంతమ్ = స్రవించుచున్న, తురీయకమ్ = తురీయమును, నేత్రాభ్యాం = నేత్రములచేత, సుసమాహితః = మిక్కిలి ఏకాగ్రుడై, పశ్యేత్ = చూడవలయును.



**తాత్పర్యం :-** ఈవిధముగా నాడీగతిని, వాయుగతిని గమనించి వివేచించి మెడతల శరీరం ఒకే రేఖలోకి వచ్చునట్లు నిటారుగ కూర్చొని, మౌనియై నోరు బిగినిచి, నిశ్చలుడై, నాసాగ్రమున, హృదయమధ్యమున, మనోమధ్యమున అమృతము స్రవించుచున్న తురీయతత్త్వమును గమనించవలెను.

---

**అపానం ముకులీకృత్య పాయుమాకృష్య చోన్ముఖమ్॥**
**ప్రణవేన సముత్థాప్య శ్రీబీజేన నివర్తయేత్।**
**స్వాత్మానం చ శ్రియం ధ్యాయేత్ అమృతప్లావనం తతః॥** **193**

**ప్రతిపదార్థం :-** అపానమ్ = అపానమును, ముకులీకృత్య = మొగ్గగాచేసి, పాయుమ్ = ముడ్డిని, ఉన్ముఖమ్ = పైకి, ఆకృష్య చ = ఆకర్షించి, ప్రణవేన = ఓంకారముతో, సముత్థాప్య = లేపి, శ్రీబీజేన = శ్రీం బీజముతో, నివర్తయేత్ = మరలింపవలెను. స్వాత్మానం = తనను, శ్రియమ్ = శ్రీనిగా, ధ్యాయేత్ = ధ్యానింపవలెను. తతః = తరువాత, అమృతప్లావనమ్ = అమృతస్నానము జరుగును.

**తాత్పర్యం :-**అపానమును మొగ్గగాచేసి, ముడ్డినిపైకి లాగి ఓంకారముతో అపానమును పైకి లేపి శ్రీబీజముతో ప్రాణములను క్రిందకు మరలించవలెను. ఈ ప్రాణాపానసంధిలో నున్న తనను శ్రీరూపముగా ధ్యానించవలెను. తరువాత అమృతస్నానము చేయవలెను.

---

**కాలవంచనమేతద్ధి సర్వముఖ్యం ప్రచక్షతే।**
**మనసా చింతితం కార్యం మనసా యేన సిధ్యతి॥** **194**
**జలేఽగ్నిజ్వలనాత్ శాఖాపల్లవాని భవంతి హి।**
**నాధన్యం జాగతం వాక్యం విపరీతా భవేత్ క్రియా॥** **195**

**ప్రతిపదార్థం :-** ఏతత్ = ఇది , కాలవంచనం హి = కాలవంచనము గదా! సర్వముఖ్యం = సర్వప్రధానము అయినదిగా, ప్రచక్షతే = చెప్పెదరు. యేన = దేనిచేత, మనసా = మనస్సుచేత, చింతితమ్ = తలచబడిన, కార్యమ్ = కార్యము, మనసా = మనస్సులోనే అనగా మనోవేగంతో, సిధ్యతి = సిద్ధించును, జలే =

నీటియందు, అగ్ని = అగ్నియొక్క, జ్వలనాత్ = మండుటనుండి, శాఖా = కొమ్మలు, పల్లవాని = చిగురాకులు, భవంతి హి = కలుగును గదా! జాగతమ్ = జగత్తుకు సంబంధించిన, వాక్యమ్ = వాక్యము, అధన్యమ్ = కృతకృత్యము కానిది, న = లేదు, క్రియా = పని, విపరీతా = తలక్రిందులయినది, న = కాదు.

**తాత్పర్యం :–** ఈ యోగమును కాలవంచన అందురు. ఇది సర్వప్రధానమయిన యోగము. ఇది ఆయుష్షును స్తంభింపజేస్తుంధి. తద్వారా జీవనకాలం పెరుగుతుంది. వీరు మనస్సులో తలచినది తలచినంత వేగంగా సిద్ధిస్తుంది. నీటిలో అగ్నిజ్వాలలనుండి మొదలుకొని కొమ్మలకు చిగుళ్లదాకా రప్పింపగలడు. జగత్తులో అతని వాక్యమేదియు వ్యర్థముకాదు. ఏ క్రియ విపరీతము అనగా తలక్రిందులుగాదు లేదా లోకవిపరీతమయిన క్రియలుగూడా చేయును.

---

**మార్గే బిందుం సమాబధ్య వహ్నిం ప్రజ్వాల్య జీవనే।**
**శోషయిత్వా తు సలిలం తేన కాయం దృఢం భవేత్॥ 196**

**ప్రతిపదార్థం :–** మార్గే = మార్గమునందు, బిందుమ్ = మనస్సును, సమాబధ్య = బంధించి, జీవనే = స్వాధిష్ఠానమునందు, వహ్నిం = అగ్నిని, ప్రజ్వాల్య = మండించి, సలిలమ్ = నీటిని, శోషయిత్వా తు = ఎండబెట్టి, తేన = అందుచేత, కాయమ్ = శరీరము, దృఢమ్ = దృఢమయినది, భవేత్ = అగును.

**తాత్పర్యం :–** సుషుమ్నా మార్గమునందు మనోబిందువును స్థాపించి జీవనం అనగా స్వాధిష్ఠానమునందు ప్రాణవాయువుతో అచ్చటి అగ్నిని మండించి, దానివలన సుషుమ్నానాడిలోని వసారూపమయిన ద్రవమును ఆర్చినందువలన శరీరము దృఢమగును.

---

**గుదయోనిసమాయుక్తమాకుంచత్యేకకాలతః।**
**అపానమూర్ధ్వగం కృత్వా సమానేన నియోజయేత్॥ 197**

**ప్రతిపదార్థం :–** గుదయోని = గుద, యోనులను, సమాయుక్తమ్ = కలిపి, ఏకకాలతః = ఒకేసారి, ఆకుంచతి = ముడుచును. అపానమ్ = అపానమును, ఊర్ధ్వగమ్ = ఊర్ధ్వగతిగల దానినిగా, కృత్వా = చేసి, సమానేన = సమాన వాయువుతో, నియోజయేత్ = కలుపవలెను.





**తాత్పర్యం :–** ఒకేసారిగా గుదయోనులను ముడుచుకొనేటట్లు చేసి, అచ్చటనుండి అపానమును ఊర్ధ్వగతం చేసి, సమానంతో కలుపవలెను.

---

**స్వాత్మానం చ శ్రియం ధ్యాయేత్ అమృతప్లావనం తతః।**
**బలం సమారభేద్యోగీ మధ్యమద్వారమాగతః॥ 198**

**ప్రతిపదార్థం :–** స్వాత్మానం చ = తనను, శ్రియమ్ = జ్ఞానలక్ష్మిగా, ధ్యాయేత్ = ధ్యానించవలయును. తతః = తరువాత, అమృతప్లావనమ్ = అమృతస్నానము జరుగును, యోగీ = యోగి, మధ్యమద్వారమ్ = సుషుమ్నా మధ్యద్వారమునకు, ఆగతః = వచ్చినవాడై, బలం = కుంభకమును, సమారభేత్ = ప్రారంభింపవలెను.

**తాత్పర్యం :–** ప్రాణాపాన సమానములు గలసిన చోట తన ఆత్మను జ్ఞానంగా భావనచేస్తూ తరువాత అమృతభావాభిషేకమును పొంది సుషుమ్నామధ్య ద్వారమునకు వచ్చిన "యోగి" అచ్చట బలమును అనగా కుంభక వాయుబలమును ప్రారంభింపవలయును.

---

**భావయేదూర్ధ్వగత్యర్థం ప్రాణాపానసుయోగతః।**
**ఏష యోగవరో దేహే సిద్ధిమార్గప్రకాశకః॥ 199**

**ప్రతిపదార్థం :–** ప్రాణాపాన = ప్రాణాపానముయొక్క, సుయోగతః = యోగంవలన, ఊర్ధ్వగత్యర్థమ్ = ఊర్ధ్వగతికొఱకు, భావయేత్ = భావింపవలయును. ఏషః = ఈ, యోగవరః = వరయోగము, సిద్ధిమార్గ = యోగసిద్ధిమార్గమును, ప్రకాశకః = ప్రకాశింపజేయును.

**తాత్పర్యం :–** ప్రాణాపానములు కలిసిన తర్వాత ఊర్ధ్వగతి కొరకు ఉదానసహిత ప్రాణమును భావింపవలయును. ఈ శ్రేష్ఠయోగము దేహమునందు బ్రహ్మప్రాప్తిరూపమయిన సిద్ధిమార్గమును సూచించును.

---

**యథైవాపాం గతః సేతుః ప్రవాహస్య నిరోధకః।**
**తథా శరీరగా చ్ఛాయా జ్ఞాతవ్యా యోగిభిః సదా॥ 200**

**ప్రతిపదార్థం :–**అపామ్ = నీటిలో, గతః = ఉన్న, సేతుః = వంతెన / అడ్డుకట్ట, ప్రవాహస్య = జల ప్రవాహమునకు, నిరోధకః = అడ్డముగా నుండునో, తథా =అలాగా, శరీరగా = శరీరగతమయిన, ఛాయా = జీవచ్ఛాయ / చిదాభానుడు, యోగిభిః = యోగులచేత, సదా = నిత్యము, జ్ఞాతవా = తెలిసికొనదగినది.

**తాత్పర్యం :–** నదిలో రాళ్లతో పెద్ద అడ్డుకట్ట వేస్తాము. అది సేతువు. అది రామసేతువు లాగా ప్రవాహాన్ని నిరోధిస్తుంది. అలాగే శరీరంలో ప్రతిబింబించిన చిదాభాసం విషయ సంబంధమయిన ప్రవాహాన్ని నిరోధిస్తుంది. చిచ్ఛాయ అంటే కుండలిని ఇది జ్ఞానశక్తి దీనిలోనే జీవుడుంటాడు. **'యయా జీవో హి ధార్యతే'** అన్నారు పెద్దలు. అందులో శక్తి = మాయ. దానిని వదలితే మిగిలింది 'జ్ఞానం – అదే తను అని తీవ్రంగా భావించటం ద్వారా తాను ప్రత్యగాత్మనని తెలుస్తుంది. తద్వారా పరాక్కులయిన విషయాల ప్రవాహం ఆగుతుంది.

---

**సర్వాసామేవ నాడీనాం ఏష బంధః ప్రకీర్తితః।**
**బంధస్యాస్య ప్రసాదేన స్ఫుటీభవతి దేవతా॥ 201**

**ప్రతిపదార్థం :–** సర్వాసామ్ = అన్ని, నాడీనామేవ = నాడులకు, ఏషః = ఈ, బంధః = బంధము, ప్రకీర్తితః = చెప్పబడినది. అస్య = ఈ, బంధస్య = బంధముయొక్క, ప్రసాదేన = నైర్మల్యంతో, దేవతా = దేవత, స్ఫుటీభవతి = స్పష్టమగును.

**తాత్పర్యం :–** సమస్త నాడులకు ఈ చెప్పబోవు చతుష్పథబంధము ముఖ్యమయినది. ఇది ఎంత నిర్మలంగా ఏర్పడితే అంతగా దేవత స్పష్టమగును.

---

**ఏష చతుష్పథో బంధో మార్గత్రయనిరోధకః।**
**ఏకం వికాసయన్ మార్గం యేన సిద్ధాః సుసంగతాః॥ 202**

**ప్రతిపదార్థం :–** ఏషః = ఈ, చతుష్పథః = చతుష్పథమనే (ప్రాణాపాన సమాన – ఉదానము), బంధః = బంధము, మార్గత్రయ = మూడునాడుల మార్గమును, నిరోధకః = నిరోధించునది అగును. యేన =ఏ మార్గముతో, సుసంగతాః = 





కలిసినవారు, సిద్ధాః = సిద్ధులయినారో, ఏకమ్ = ఆ ఒక్క మార్గం అనగా బ్రహ్మనాడీ మార్గమును, వికాసయన్ = వికసింపజేయుచుండును.

**తాత్పర్యం :–** ఇది చతుష్పథబంధము. మూలకందము వద్ద రకరకాల నాడులు గలవు. 8,10,12,13 ఇలా నాడుల సంఖ్యలో తేడాలు గలవు. అందు ముఖ్యమయినవి ప్రకృతి పురుషనాడులు ఇడా పింగళా. కుహూనాడి అపాన సంబంధమయిన నాడి. సుషుమ్నా బ్రహ్మనాడి. వీటి నాల్గింటి కూడలి, 'చతుష్పథము' శృంగాటకము అంటారు. ఇదంతా మూలాధారం వద్దనున్న విషయం. నాభివద్ద గూడా ఇలాగే చెప్తారు. బండి చక్రపు కుండనుండి నలువైపులు ఆకులు వెళ్లినట్లు నాల్గువైపుల నాడులు ప్రసరిస్తాయి కనుక 'నాభి' అన్నారు. అసలు విషయానికి వస్తే, చతుష్పథ బంధము ఇడా పింగళా కుహూనాడుల మార్గాలను మూసి సుషుమ్నా మార్గాన్ని (ఉదానం) మాత్రమే తెరిచి అందులోకి ప్రాణవాయువును ప్రవేశ పెడ్తుంది. దీనికి 'జాలంధరబంధం పైనుంచి తోడవుతుంది. ఇదంతా కుంభకస్థితిలో సాధ్యమవుతుంది. ఈ మార్గంలో చేరినవారికే బ్రహ్మదర్శనం గాని యోగసిద్ధులుగాని వస్తాయి. అందుకే దీనిని దేవమార్గము అంటారు. కాని వాడుకలో దేవమార్గం అంటే విసర్జన స్థానం అన్న అర్థం రూఢి అయినది.

---

**ఉదానమూర్ధ్వగం కృత్వా ప్రాణేన సహ వేగతః।**
**బంధోऽయం సర్వనాడీనామూర్ధ్వం యాతి నిరోధకః॥ 203**

**ప్రతిపదార్థం :–** ప్రాణేన సహ = ప్రాణంతో కలిపి, వేగతః = వేగంగా, ఉదానమ్ = ఉదానవాయువును, ఊర్ధ్వగమ్ = ఊర్ధ్వగతి గలదానినిగా, కృత్వా = చేసి, అయం = ఈ, బంధః = బంధము, సర్వనాడీనామ్ = సర్వనాడులను, నిరోధకః = నిరోధం చేయునదై, ఊర్ధ్వమ్ = ఊర్ధ్వముఖముగా, యాతి = వెడలును.

**తాత్పర్యం :–** ఈ చతుష్పథబంధము వలన ప్రాణము మహావేగంగా ఉదానగతి పొందుతుంది. ప్రక్కనాడులను, అధోనాడులను వదలి కేవలం సుషుమ్నలో పైకి సాగుతుంది.

దీనికి మూలబంధముతో బాటు జాలంధరబంధం అవసరమవుతుంది. ఈ జాలంధరం వలన మెడవద్ద బిగింపువలన మూలబంధం వలన మూలాధారం వద్ద బిగింపువలన మధ్యగతమయిన కుంభక వాయువు – మన అదృష్టం వలన

– సుషుమ్నా రంధ్రములోనికి చేరుతుంది. దీనికి జన్మజన్మల అదృష్టం అభ్యాసం తప్పనిసరి. అందువలన కుతూహలంతో ఇట్టి ప్రయత్నం చేయువారు యోగభ్రష్టులయి సహజ జీవితసౌకర్యం కోల్పోతారు. కనుక అనుభవంగల నిజమయిన గురువు లేకుండా వీటిని అభ్యాసం చేయరాదు. కాని యీ పద్ధతిని రోజూ భావన చేయవచ్చును. భావనవలన భగవదనుగ్రహంతో సద్గురువు లభించ వచ్చును. భావనారూపంగా చేసేయోగం ప్రమాదకారికాదు. ఇట్టి భావన తంత్రములో గలదు. చూ॥ విజ్ఞానభైరవతంత్రము.

---

**అయం చ సంపుటో యోగో మూలబంధోఽప్యయం మతః।**
**బంధత్రయమనేనైవ సిధ్యత్యభ్యాసయోగతః॥ 204**

**ప్రతిపదార్థం :–** అయం చ = ఇది, సంపుటః = సంపుటమను పేరుగల, యోగః = యోగము, అయమ్ = ఇది, మూలబంధోఽపి = మూలబంధమని గూడ, మతః = తలచబడినది. అభ్యాసయోగతః = అలవాటువలన, అనేనైవ = ఈ యోగం చేతనే , బంధత్రయమ్ = మూడుబంధములు, సిధ్యతి = సిద్ధించును.

**తాత్పర్యం :–** దీనిని సంపుటయోగం అంటారు. మూలబంధమునందు అన్నింటిని ఒకచోటకు లాగగా జాలంధరబంధంతో పైనుంచి మూతపెట్టినట్లు అదమటం వలన ఇది సంపుటయోగం అంటారు. దీని మరొకపేరు మూలబంధము. ఈ ఆసనం వలన ఉద్యాణబంధము, మూలబంధము, జాలాంధర బంధము సిద్ధించును.

---

## ప్రాణాయామ ప్రయోజనాలు

**దివారాత్రమవిచ్ఛిన్నం యామే యామే యదా తదా।**
**అనేనాభ్యాసయోగేన వాయురభ్యసితో భవేత్॥ 205**

**ప్రతిపదార్థం :–** దివారాత్రమ్ = రేయింబవళ్ళు, యామే యామే = జాముజామునకు, యదాతదా = ఎపుడు వీలయితే అపుడు, అనేన = ఈ, అభ్యాసయోగేన=మూలబంధాభ్యాసంతో, వాయుః = వాయువు, అభ్యసితః = అలవాటయినది, భవేత్ = అగును.





**తాత్పర్యం :–** రేయింబవళ్లు ఎపుడు వీలయితే అపుడు జాము జామున ఈ మూలబంధమును రేచక పూరక కుంభకములతో అనుసరించినచో ప్రాణవాయువు అలవాటులోకి వచ్చి స్వాధీనమగును.

---

**వాయావభ్యసితే వహ్నిః ప్రత్యహం వర్ధతే తనౌ।**
**వహ్నౌ వివర్ధమానే తు సుఖమన్నాది జీర్యతే॥ 206**

**ప్రతిపదార్థం :–** వాయౌ = వాయువు, అభ్యసితే = అలవాటు చేయబడగా, తనౌ = శరీరమునందు, ప్రత్యహమ్ = ప్రతిదినము, వహ్నిః = అగ్ని, వర్ధతే = పెరుగును. వహ్నౌ = అగ్ని, వివర్ధమానేతు = పెరుగుతుంటే, అన్నాది = అన్నము మొదలగునవి, సుఖమ్ = సుఖముగా, జీర్యతే = అరుగును.

**తాత్పర్యం :–** ప్రాణాయామాభ్యాసం – పైన చెప్పిన విధంగా పెరిగేకొద్ది శరీరంలో అగ్ని బాగా పెరుగును. అగ్ని బాగా పెరగటం వలన అన్నాది – ఆహారమంతయు సుఖముగా జీర్ణమగును.

---

**అన్నస్య పరిపాకేన రసవృద్ధిః ప్రజాయతే।**
**రసే వృద్ధిం గతే నిత్యం వర్ధంతే ధాతవస్తథా॥ 207**

**ప్రతిపదార్థం :–**అన్నస్య = అన్నముయొక్క, పరిపాకేన = జీర్ణమగుటచేత, రస = రసముయొక్క, వృద్ధిః = వృద్ధి, ప్రజాయతే = జరుగును. రసే = రసము, వృద్ధిమ్ = వృద్ధిని, గతే = పొందగా, తథా = అదే విధంగా, ధాతవః = ధాతువులు, నిత్యమ్ = నిత్యము, వర్ధంతే = పెరుగును.

**తాత్పర్యం :–** అన్నం కడుపులో సరిగా పచనమయితే అన్నరసం బాగా వృద్ధి పొందుతుంది. సరిగా పచనమయిన అన్నరసం వలన రక్తాది వీర్యాంతం సప్తధాతువులు చక్కగా నిర్దోషముగా వృద్ధి చెందును.

---

**ధాతూనాం వర్ధనేనైవ ప్రబోధో వర్ధతే తనౌ**
**దహ్యంతే సర్వపాపాని జన్మకోట్యార్జితాని చ॥ 208**

**ప్రతిపదార్థం :-** ధాతూనామ్ = సప్తధాతువులయొక్క, వర్ధనేనైవ = పెరుగుదలతోనే, తనౌ = శరీరమునందు, ప్రబోధః = జ్ఞానము, వర్ధతే = పెరుగును, జన్మకోటి = కోటి జన్మలలో, ఆర్జితాని = సంపాదించబడిన, సర్వ = సమస్తమయిన, పాపాని చ = పాపములున్ను, దహ్యంతే = తగులబెట్టబడును.

**తాత్పర్యం :-** ధాతువులు చక్కగా వృద్ధి పొందటం వలన జ్ఞానవృద్ధి జరుగును. దానివలన కోటిజన్మార్జితములయిన పాపములు గూడా నశించును.

పాపనాశకమయిన పరబ్రహ్మ జ్ఞానము కలుగవలెనంటే చిత్తశుద్ధి కావాలి. చిత్తశుద్ధి కావాలంటే దేహంశుద్ధి గావాలి. అందుకు ధాతుశుద్ధి అవసరం. దానికి ఆహారం మొ॥ సక్రమంగా అమృతరూపమయిన అన్నరసాన్ని పుట్టించాలి. అందుకు జఠరాగ్ని బాగుండాలి. దానికి తిత్తివేసినట్లు మూలబంధంతో ప్రాణాయామాలు జరగాలి. కనుక పరంపరయా ఇదంతా జ్ఞాననిష్పత్తి ప్రణాలికలోనిది కనుక సమర్థించుకొనవచ్చును లేదా జ్ఞానంవలన పాపనాశమని చెప్పవచ్చును.

---

**గుదమేఢ్రాంతరాళస్థం మూలాధారం త్రికోణకమ్।**
**శివస్య బిందురూపస్య స్థానం తద్ధి ప్రకాశకమ్॥ 209**

**ప్రతిపదార్థం :-** గుద = ముడ్డి, మేఢ్ర = లింగములయొక్క, అంతరాళ = మధ్యమునందు, స్థమ్ = ఉన్నదియు, త్రికోణకమ్ = మూడుకోణములుగలదియు అగు, మూలాధారమ్ = మూలాధారస్థానము, బిందురూపస్య = బిందురూపుడయిన (పరానాద బిందువు / వీర్యబిందువు), శివస్య = శివునియొక్క, స్థానమే = స్థానము. తత్ = ఆ స్థానము, ప్రకాశకమ్ హి = ప్రకాశింపజేయునది కదా!

**తాత్పర్యం :-** "ముడ్డి - లింగము"మధ్య త్రికోణాత్మకమయిన మూలాధారము బిందురూపుడయిన శివునకు స్థానము. అది ప్రకాశాత్మకము. ఓంకారమందలి బిందువు శివరూపము. నాదముయొక్క ప్రాథమిక స్థితి అనగా పరానాదస్థితి బిందురూపము. వీర్యము బిందురూపము. శుక్రశోణితములు శివశక్తి రూపములు గదా. శివుడు ప్రకాశస్వరూపము. కనుక మూలాధారగత శివరూపము ప్రకాశాత్మకము. ప్రకాశము అనగా జ్ఞానము. అదే జీవరూపము. కనుక మూలాధారంలో ప్రకాశరూపము అవ్యక్తముగా నుండును.

---





**యత్ర కుండలినీ నామ పరాశక్తిః ప్రతిష్ఠితా।**
**యస్మాదుత్పద్యతే వాయుః యస్మాద్వహ్నిః ప్రవర్ధతే॥ 210**

**ప్రతిపదార్థం :-** యత్ర = ఏ మూలాధారమునందు, కుండలినీ నామ = కుండలిని అని ప్రసిద్ధిగల, పరాశక్తిః = పరావాగ్రూపశక్తి, ప్రతిష్ఠితా = నిశ్చలముగానున్నదో, యస్మాత్ = ఏ మూలాధారమునుండి, వాయుః = వాయువు, ఉత్పద్యతే = పుట్టునో, యస్మాత్ = దేనినుండి, వహ్నిః = అగ్ని, ప్రవర్ధతే = పెరుగునో.

**తాత్పర్యం :-** మూలాధారచక్రమునందే 'కుండలిని' - అను పరాశక్తి నిశ్చలముగా పరుండియుండును. ఆ చక్రమునందే వాయువు పుట్టును. అచ్చటనే అగ్ని మొదలగును. మూలాధార స్వాధిష్ఠానములు కలిపి అగ్నిబంధమని చెప్పెదరు.

---

**యస్మాదుత్పద్యతే బిందుః యస్మాన్నాదః ప్రవర్ధతే।**
**యస్మాదుత్పద్యతే హంసః యస్మాదుత్పద్యతే మనః॥ 211**

**ప్రతిపదార్థం :-** యస్మాత్ = దేనినుండి, బిందుః = బిందువు, ఉత్పద్యతే = పుట్టునో, యస్మాత్ = దేనినుండి, నాదః = నాదము, ప్రవర్ధతే = ప్రవర్తించునో, యస్మాత్ = దేనినుండి, హంసః = హంస, ఉత్పద్యతే = పుట్టునో, యస్మాత్ = దేనినుంచి, మనః = మనస్సు, ఉత్పద్యతే = పుట్టునో.

**తాత్పర్యం :-** మూలాధార చక్రమునుండియే అవ్యక్తరూపంగా బిందువు, నాదము (పరావాక్కు) హంస అనగా శ్వాస, మనస్సు పుట్టును. మూలాధారమునందున్న గణేశునకు అజపారూపహంస జపాన్ని (సోఽహం అను శ్వాసలను) అంకితమివ్వడం యోగశాస్త్ర ప్రసిద్ధము. హంస - అనగా 'సోహం' అను అక్షరము సంకేతముగా చెప్పబడిన ఉచ్ఛ్వాస నిఃశ్వాసలు. అదే ఓంకార మూలము. వాయువు నాదమూలము కనుక వాయువున్నచోట ఇవన్ని ఉంటాయి. అన్నింటికి ఇది మూలం కనుక మూలాధారచక్రము.

---

**మూలాధారాది షట్చక్రం శక్తిస్థానముదీరితమ్।**
**కంఠాదుపరి మూర్ధాంతం శాంభవం స్థానముచ్యతే॥ 212**

**ప్రతిపదార్థం :–** మూలాధారాది = మూలాధారము మొదలుకొని, షట్చక్రమ్ = ఆరు చక్రములు, శక్తిస్థానమ్ = శక్తిస్థానముగా, ఉదీరితమ్ = చెప్పబడినది. కంఠాత్ = కంఠమునుండి, ఉపరి = పైన, మూర్ధాంతమ్ = తలవరకు, శాంభవమ్ = శంభు సంబంధమయిన, స్థానమ్ = స్థానమని, ఉచ్యతే = చెప్పబడును.

**తాత్పర్యం :–** మూలాధారం, స్వాధిష్ఠానం, మణిపూరకం, అనాహతం, విశుద్ధం, ఆజ్ఞా – ఈ 6 చక్రములు శక్తిస్థానము. ఆజ్ఞనుంచి తలవరకు శాంభవస్థానము. ఇందులో ఆజ్ఞాచక్రము శివశక్తి మిథునస్థానము. అందువలన శ్లోకంలో చెప్పిన “6” చక్రాలలో ఆజ్ఞ అటు ఇటు సరిపోతుంధి. అలాగే కంఠంపైన ఉన్న స్థానం భ్రూమధ్యం ఆజ్ఞాచక్రస్థానం. అది శివశక్తి మిథునస్థానమే కనుక దానిని గూడా శాంభవంలో కలపాలి. కచ్చితంగా చెప్పాలంటే ‘5’ చక్రాలు కంఠం దాకా ఉన్నవి శక్తి స్థానాలు. ఆజ్ఞాచక్రం శివశక్తి స్థానము. మిగిలినది సహస్రారం పూర్ణశివస్థానము. శక్తి అంతర్లీనం.

---

**నాడీనామాశ్రయః పిండః నాడ్యః ప్రాణస్య చాశ్రయాః।**
**జీవస్య నిలయః ప్రాణో జీవో హంసస్య చాశ్రయః॥ 213**

**ప్రతిపదార్థం :–** పిండః = శరీరము, నాడీనామ్ = నాడులకు, ఆశ్రయః = ఆశ్రయమయినది, నాడ్యః = నాడులు, ప్రాణస్య = ప్రాణమునకు, ఆశ్రయాః = ఆశ్రయమయినవి. ప్రాణః = ప్రాణము, జీవస్య = జీవునకు, నిలయః = ఆశ్రయము. జీవః = జీవుడు, హంసస్య చ = హంసకు, ఆశ్రయః = ఆధారము.

**తాత్పర్యం :–** శరీరమునందు నాడులు, నాడులయందు ప్రాణము, ప్రాణమునందు జీవుడు, జీవుని యందు హంస ఉన్నవి. హంస అనగా పరమాత్మ.

---

**హంసః శక్తేరధిష్ఠానం చరాచరమిదం జగత్।**
**నిర్వికల్పం ప్రసన్నాత్మా ప్రాణాయామం సమభ్యసేత్॥ 214**

**ప్రతిపదార్థం :–** హంసః = హంస, శక్తేః = శక్తికి, అధిష్ఠానమ్ = ఆధారము, ఇదమ్ = ఈ, చరాచరమ్ = స్థావర జంగమాత్మకమయిన, జగత్ = ప్రపంచము



శక్తియే, నిర్వికల్పః = వికల్పరహితుడై, ప్రసన్నాత్మా = ప్రసన్న మనస్సుగలవాడై, ప్రాణాయామమ్ = ప్రాణాయామమును, సమభ్యసేత్ = అభ్యసింపవలయును.

**తాత్పర్యం :–** హంస అనగా పరమాత్మ శక్తికి అధిష్ఠానము. ఈ చరాచరాత్మకమయిన ప్రపంచము శక్తికి అధిష్ఠానమయిన బ్రహ్మమే. కనుక వికల్పరహితుడై ప్రసన్న మనసుతో ప్రాణాయామమును అభ్యసింపవలెను.

---

**సమ్యగ్బంధత్రయస్థోఽపి లక్ష్యలక్షణకారణమ్।**
**వేద్యం సముద్ధరేన్నిత్యం సత్యసంధానమానసః॥ 215**

**ప్రతిపదార్థం :–** సమ్యక్ = చక్కగా, బంధత్రయ = మూడు బంధములయందు, స్థోఽపి = ఉండి, సత్య = సత్యముతో, సంధాన = సంధానము చెందు, మానసః = మనస్సుగలవాడై, లక్ష్యలక్షణ = లక్ష్య లక్షణములకు, కారణమ్ = హేతువయిన, వేద్యమ్ = జ్ఞేయమయిన, నిత్యమ్ = నిత్యమును, సముద్ధరేత్ = ఉద్ధరింపవలెను.

**తాత్పర్యం :–** మూల ఉడ్యాణ జాలంధర బంధములనభ్యసించి దృక్, దృశ్యములకు కారణమయిన నిత్యము జ్ఞేయము అయిన బ్రహ్మమును, సత్యాన్వేషణ మనస్సుతో వెలికితీయవలయును. దానివలన స్వరూపమును గ్రహించును.

---

**రేచకం పూరకం చైవ కుంభమధ్యే నిరోపయేత్।**
**దృశ్యమానే పరే లక్ష్యే బ్రహ్మణి స్వయమాశ్రితః॥ 216**

**ప్రతిపదార్థం :–** దృశ్యమానే = కనబడుచున్న, పరే = పరమయిన, లక్ష్యే = లక్ష్యమయిన, బ్రహ్మణి = బ్రహ్మమునందు, స్వయమ్ = స్వయముగా, ఆశ్రితః = ఉన్నవాడై, రేచకమ్ = రేచకమును, పూరకం చైవ = పూరకమును, కుంభమధ్యే = కుంభక మధ్యమున, నిరోపయేత్ = వేయవలెను.

**తాత్పర్యం :–** పరమలక్ష్యమయిన బ్రహ్మమునందు తదేక నిష్ఠతో నున్నవాడై కుంభక మధ్యమున రేచక పూరకములను ముంచి వేయవలెను. రేచకాదులు తరువాత శ్లోకంలో వివరిస్తాడు.

---

**స్వాంతస్థవిషయం సర్వం రేచకః సముదాహృతః।**
**పూరకం శాస్త్రవిజ్ఞానం కుంభకం స్వగతం స్మృతమ్॥ 217**

**ప్రతిపదార్థం :–** స్వ = తన, అంతస్థ్స = మనస్సులోని, విషయమ్ = విషయము, సర్వమ్ = అంతయు, రేచకః = రేచకమని, సముదాహృతః = చెప్పబడినది. శాస్త్రవిజ్ఞానమ్ = శాస్త్రవిజ్ఞానమంతయు, పూరకం = పూరకమని, స్వగతమ్ = తనయందున్న సహజజ్ఞానము, కుంభకమ్ = కుంభకముగా, స్మృతమ్ = చెప్పబడినది.

**తాత్పర్యం :–** తన మనస్సులోని విషయాలు రేచకములు. వాటిని వదలాలి. శాస్త్రసంబంధంగా మనం గ్రహించిన విజ్ఞానం పూరకం. దీనిద్వారా మనం నిలుపుకొనవలసిన శుద్ధజ్ఞానము లేదా స్వరూపజ్ఞానము కుంభకము. అనగా రేచక పూరకములు వదలిన తర్వాత నిలచిన కేవల కుంభకము స్వస్వరూపానుసంధానము. ఇచ్చట ప్రాణాయామ విషయ సంకేతంతో జ్ఞానవిషయం చెప్పటం జరిగింది.

1. మనలో ఉన్న గాలిని బయటకు వదలినట్లు మన మనస్సులో ఉన్న విషయజ్ఞానాలు బయటకు వదలటం – రేచకం.

2. బయటనున్న గాలితో మనం లోపల నింపుకొన్నట్లు శాస్త్రజ్ఞానమును బయట నుంచి మనం లోపలకు నింపుకొనటం – పూరకం.

3. పూరకం ద్వారా వచ్చిన గాలిని లోపలనింపి అట్టిపెట్టినట్లు – శాస్త్రంద్వారా వచ్చిన బ్రహ్మజ్ఞానములను తనలో నిలుపుకొని ఆత్మస్వరూపజ్ఞానం పొందటం కుంభకము. అందువలన ఇది బ్రహ్మానుసంధానము.

---

**ఏవమభ్యాసచిత్తశ్చేత్ స ముక్తో నాత్ర సంశయః।**
**కుంభకేన సమారోప్య కుంభకేనైవ పూరయేత్॥**
**కుంభేన కుంభయేత్కుంభం తదంతస్థః పరం శివమ్।**
**పునరాస్ఫాలయేదద్య సుస్థిరం కంఠముద్రయా॥**
**వాయూనాం గతిమావృత్య ధృత్వా పూరకకుంభకౌ । 218**

**ప్రతిపదార్థం :–** ఏవమ్ = ఈవిధముగా, అభ్యాస = అభ్యాసముగల, చిత్తశ్చేత్ = మనస్సుగలవాడయినట్లయితే, సః = అట్టివాడు, ముక్తః = ముక్తిపొందెను. అత్ర





= ఇచ్చట, సంశయః = సందేహము, న = లేదు. కుంభకేన = కుంభకముచేత, సమారోప్య = ఎక్కించి, కుంభకేనైవ = కుంభకము చేతనే, పూరయేత్ = నింపవలయును. కుంభేన = కుంభకముచేత, కుంభమ్ = కుంభమును, కుంభయేత్ = కుంభింపవలయును. తదంతస్థః = కుంభకమునందున్నవాడై, పరంశివమ్ = పరమేశ్వరుని, ధ్యానింపవలయును. వాయూనామ్ = వాయువులయొక్క, గతిమ్ = గతిని, ఆవృత్య = ఆవరించి, పూరకకుంభకౌ = పూరక కుంభకములను, ధృత్వా = నిలిపి, కంఠ = కంఠమువద్ద వేయబడు ముద్రయా = జాలంధరముద్రతో, సుస్థిరమ్ = చిత్తము స్థిరమగునట్లు, పునః = మరల, ఆస్ఫాలయేత్ = చరచి యుంచవలెను.

**తాత్పర్యం :–** రేచకపూరకముల భస్త్రిక లేకుండా కేవలపూరకముతో 'కుంభకం' ప్రధానంగా చేయాలి. అందులో బ్రహ్మానుసంధానం చేయాలి. చిత్తం బాహ్యవ్యాపారాలకు పోతుంటే మరల పూరకకుంభకాలు చేసి కుంభకస్థితిలో జాలంధర బంధంతో మనస్సును ప్రాణమును స్థిరపరచాలి.

---

**సమహస్తయుగం భూమౌ సమం పాదయుగం తథా॥**
**వేధకత్రయయోగేన చతుష్పీఠం తు వాయునా।**
**ఆస్ఫాలయేన్మహామేరుం వాయువక్త్రే ప్రకోటిభిః॥ 219**

**ప్రతిపదార్థం :–** భూమౌ = నేలయందు, సమ = సమానమయిన, హస్తయుగమ్ = హస్తద్వంద్వము కలుగునట్లుగా, తథా = అలాగే, పాదయుగమ్ = పాదద్వంద్వము, సమమ్ = సమానమగునట్లుగా, ఉండవలెను. వేధకత్రయ = మూడు వేధకములయొక్క, యోగేన = కలయికతో, వాయునా= ప్రాణవాయువుతో, చతుష్పీఠమ్ = మూలకందమును, మహామేరుమ్ = మహామేరువును, ఆస్ఫాలయేత్ = చరచవలెను. ప్రకోటిభిః = పరికరములచేత, వాయువక్త్రే = వాయువుయొక్క ముఖమునందు, ఆస్ఫాలయేత్ = చరచవలయును.

**తాత్పర్యం :–** యోగి తనకు నచ్చిన స్థలమునందు పాణిపాదములు సమంగా ఉంచి వేధకములయిన మూడు ఆసనములతో (అనగా మూలబంధ, ఉడ్యాణ, జాలంధర బంధములు) వాయువును బిగించి మూలకందమును (చతుష్పీఠము అనగా 4×4 అంగులాల ఎత్తుపొడవుగల అండాకారమయిన పీఠము) దానితోబాటు

మహామేరువును (అనగా వెన్నును వెన్నులోని నాడీత్రయమును) చరచును. అలాగే వాయువు వెన్నులోకి దూరే చోటునందు వాయుప్రహారములతో గట్టిగా ప్రయత్నించవలెను.

---

**పుటద్వయం సమాకృష్య వాయుః స్ఫురతి సత్వరమ్।**
**సోమసూర్యాగ్నిసంబంధాత్ జానీయాదమృతాయ వై॥**
**మేరుమధ్యగతా దేవాః చలంతే మేరుచాలనాత్ ।** **220**

**ప్రతిపదార్థం :–** పుటద్వయమ్ = రెండు పుటములను, ఆకృష్య = లాగగా, వాయుః = వాయువు, సత్వరమ్ = వెంటనే, స్ఫురతి = స్ఫురించును. సోమ = చంద్రునియొక్క, సూర్య = సూర్యునియొక్క, అగ్ని =అగ్నియొక్క, సంబంధాత్ = సంబంధమువలన, అమృతాయ వై = అమృతముకొఱకు, జానీయాత్ = ఎరుగవలయును. మేరుచాలనాత్ = మేరువును చరచటంవలన, మేరుమధ్య = మేరుమధ్యమునందు, గతాః = ఉన్న, దేవాః = దేవతలు, చలంతే = కదలుదురు.

**తాత్పర్యం :–** సంపుటయోగములోని పుటద్వయమును అనగా శాంభవశక్తి స్థానములను రెండు పుటలను గట్టిగా ఒత్తిడి చేయగా, (మూలబంధ జాలంధరములను), వెంటనే సుషుమ్నాద్వారమున వాయువు స్ఫురించును. ఆ బ్రహ్మనాడి సోమసూర్య అగ్నిమయము. అందు మూలాధారాదిగా అగ్ని ఖండము అనాహతాది సూర్యఖండము. ఆజ్ఞాసహస్రారములు చంద్రఖండము. వీటి సంబంధము. అదిగాక సోమనాడి ఇడ, సూర్యనాడి పింగళ. సుషుమ్నా అగ్నినాడి. కనుక వీటి సంబంధమువలన అని గూడా చెప్పవచ్చును. ఎందుకంటే యోగంలో ఈ రెండు సంబంధాలు తప్పవుగదా! దీని తరువాత సహస్రారము నుంచి అమృతస్రావము జరుగును. 'సుధాసారాభివర్షిణీ' అన్నారుగదా! వాయువుయొక్క ప్రవేశంతో మహాధ్వనితో మేరువు కంపిస్తుంది. మేరువునందున్న ఇంద్రియాది దేవతలు గూడా కంపిస్తారు. వారు అమృతస్నానం చేస్తారు.

---





## యోగసోపానములు

**ఆదౌ సంజాయతే క్షిప్రం వేధోఽస్య బ్రహ్మగ్రంథితః॥**
**బ్రహ్మగ్రంథిం తతో భిత్త్వా విష్ణుగ్రంథిం భినత్త్యసౌ।**
**విష్ణుగ్రంథిం తతో భిత్త్వా రుద్రగ్రంథిం భినత్త్యసౌ॥** **221**

**ప్రతిపదార్థం :–** ఆదౌ = మొదట, అస్య = ఇతనికి, బ్రహ్మగ్రంథితః = బ్రహ్మగ్రంథివద్ద, క్షిప్రమ్ = శీఘ్రముగా, వేధః = వేధ, సంజాయతే = కలుగును. బ్రహ్మగ్రంథిమ్ = బ్రహ్మగ్రంథిని, భిత్త్వా = భేదించి, తతః = తరువాత, అసౌ = ఇది, విష్ణుగ్రంథిమ్ = విష్ణుగ్రంథిని, భినత్తి = భేదించును. విష్ణుగ్రంథిమ్ = విష్ణుగ్రంథిని, భిత్త్వా = భేదించి, తతః = తరువాత, రుద్రగ్రంథిమ్ = రుద్రగ్రంథిని, భినత్తి = భేదించును.

**తాత్పర్యం :–** మొదట యోగికి బ్రహ్మగ్రంథి భేదం తరువాత విష్ణుగ్రంథి తరువాత రుద్రగ్రంథి భేదము జరుగుతుంది.

---

**రుద్రగ్రంథిం తతో భిత్త్వా ఛిత్త్వా మోహమలం తథా।**
**అనేకజన్మసంస్కారగురుదేవప్రసాదతః॥**
**యోగాభ్యాసాత్తతో వేధో జాయతే తస్య యోగినః॥** **222**

**ప్రతిపదార్థం :–** తతః = తరువాత, రుద్రగ్రంథిమ్ = రుద్రగ్రంథిని, భిత్త్వా = భేదించి, తథా = అలాగే, మోహమలమ్ = మోహ రూపమయిన మాలిన్యమును, ఛిత్త్వా = ఛేదించి యోగి బాగుపడును, తస్య = ఆ, యోగినః = యోగికి, అనేక = చాల, జన్మ = జన్మలలోని, సంస్కార = యోగాభ్యాససంస్కారములు, గురు = గురువులు, దేవ = దేవతలుయొక్క ప్రసాదతః = అనుగ్రహంవలన, యోగాభ్యాసాత్ = ఈ జన్మలోని యోగాభ్యాసంవలన, తతః = అందువలన, వేధః = వేధ, జాయతే = కలుగును.

**తాత్పర్యం :–** రుద్రగ్రంథిని భేదించిన తరువాత యోగికున్న మోహమాలిన్యం నశించును. ఇంతటి యోగవిన్యాసము తేలికగా లభించదు. ఈ జన్మలో యోగాభ్యాసము, దానికి ఆధారంగా పూర్వజన్మయోగసంస్కారము, గురుదేవానుగ్రహం ఉంటాయి. అట్టి సందర్భంలోనే ఇట్టి వేధ జరుగును.

**ఇడాపింగళయోర్మధ్యే సుషుమ్నానాడిమండలే ॥**

**ముద్రాబంధవిశేషేణ వాయుమూర్ధ్వం చ కారయేత్ । 223**

**ప్రతిపదార్థం :-** ఇడా = ఇడా నాడియొక్క, పింగళయోః = పింగళానాడియొక్క, మధ్యే = మధ్యయందు, సుషుమ్నా = సుషుమ్నా అను, నాడిమండలే = నాడీమండలమునందు, ముద్రా = ముద్రలయొక్క, బంధ = బంధములయొక్క విశేషేణ = విశేషముచేత, వాయుమ్ = వాయువును, ఊర్ధ్వం చ = ఊర్ధ్వగతముగా, కారయేత్ = చేయవలయును.

**తాత్పర్యం :-** వేధ సిద్ధించే మార్గమిది. ఇడా పింగళల మధ్యన సుషుమ్నానాడి గలదు. దానియందు ఖేచరీముద్ర మొదలగు ముద్రలద్వారా, మూలబంధము మొదలగు బంధముల ద్వారా కుంభకం ద్వారా వాయువును సుషుమ్నలో ఊర్ధ్వముఖంగా నడిపించవలయును.

---

**హ్రస్వో దహతి పాపాని దీర్ఘో మోక్షప్రదాయకః।**

**ఆప్యాయనః ప్లుతో వాపి త్రివిధోచ్చారణేన తు॥ 224**

**ప్రతిపదార్థం :-** హ్రస్వః = హ్రస్వమయిన ప్రణవము, పాపాని = పాపములను, దహతి = దహించును. దీర్ఘః = దీర్ఘప్రణవము, మోక్ష = మోక్షమునకు, ప్రదాయకః = దాయకము, ప్లుతోవాపి = దీర్ఘంకన్న పెద్ద స్వరము, ఆప్యాయనః = ఆహ్లాదకరముగా నుండును. త్రివిధ = మూడు విధములయిన, ఉచ్చారణేన తు = ఉచ్చారణచేత ప్రణవోపాసన చేయదగును.

---

**తైలధారామివాచ్ఛిన్నం దీర్ఘఘంటానినాదవత్॥**

**అవాచ్యం ప్రణవస్యాగ్రం యస్తం వేద స వేదవిత్ । 225**

**ప్రతిపదార్థం :-**తైలధారామివ = నూనెధారవలె, అచ్ఛిన్నమ్= ఎడ తెగనిదియు, దీర్ఘ = పొడవయిన, ఘంటా = గంటయొక్క, నినాదవత్ = ధ్వనివలె ఉండునదియు, అవాచ్యమ్ = అనిర్వచనీయమయినదియు, అగు తమ్ = ఆ, ప్రణవస్య = ప్రణవముయొక్క, అగ్రమ్ = కొసను, యః = ఎవడు, వేద = ఎరుగునో, సః = అతడే, వేదవిత్ = వేదవేత్త అగును.





**తాత్పర్యం :-** నూనెధారవలె నిరంతరముగా, దీర్ఘఘంటానాదంలాగా ఉండే ప్రణవశిఖను గుర్తించినవాడే వేదవేత్త.

---

**హ్రస్వం బిందుగతం దైర్ఘ్యం బ్రహ్మరంధ్రగతం ప్లుతః।**

**ద్వాదశాంతగతం మంత్రం ప్రసాదం మంత్రసిద్ధయే॥**

**సర్వవిఘ్నహరశ్చాయం ప్రణవః సర్వదోషహా। 226**

**ప్రతిపదార్థం :-** బిందుగతమ్ = మనోగతమయిన, మంత్రమ్ = ప్రణవమంత్రము, హ్రస్వమ్ = హ్రస్వము, బ్రహ్మరంధ్రగతమ్ = బ్రహ్మ రంధ్రమునకు చేరినది, దైర్ఘ్యం = దీర్ఘప్రణవము, ద్వాదశాంత = పిలక ఉండుచోటున, గతమ్ = చేరినది, ప్లుతమ్ = ప్లుతమగును. మంత్రసిద్ధయే = మంత్రసిద్ధి కొరకు, ప్రసాదమ్ = ప్రసాదకరమయినది. లేదా, మంత్రమ్ = మననాత్మకమయిన ప్రణవము, సర్వసిద్ధయే = సమస్త సిద్ధికొరకు, ప్రసాదమ్ = అనుగ్రహకరమయినది, సర్వ = సమస్తమయిన, విఘ్న = విఘ్నములను, హరఃచ = హరించునట్టి, అయమ్ = ఈ, ప్రణవః = ఓంకారము, సర్వదోషహా = సర్వదోషహరము.

**తాత్పర్యం :-** హృదయగతంగా అనాహతంలో మొదలయిన ప్రణవము హ్రస్వము. బ్రహ్మరంధ్రమును చేరినది దీర్ఘము. అచ్చటనుంచి వెనుకనున్న ద్వాదశాంతమునకు (పిలక ఉండేచోటు) చేరినది ప్లుతము. మననాత్మకమయిన ప్రణవము సర్వసిద్ధిప్రదము. సర్వవిఘ్నహరము సర్వపాపహరము.

---

**ఆరంభశ్చ ఘటశ్చైవ తథా పరిచయస్తథా॥**

**నిష్పత్తిశ్చేతి కథితాః చతస్రః తస్య భూమికాః। 227**

**తాత్పర్యం :-** ప్రణవమునకు 4 దశలు గలవు.

1. ఆరంభము 2. ఘటము 3. పరిచయము 4. నిష్పత్తి.

---

**కరణత్రయసంభూతం బాహ్యం కర్మ పరిత్యజన్॥**

**ఆంతరం కర్మ కురుతే యత్రారంభస్స ఉచ్యతే। 228**

**ప్రతిపదార్థం :–** కరణత్రయ = మనోవాక్కాయములు మూడింటివలన, సంభూతమ్ = పుట్టిన, బాహ్యమ్ = బాహ్యమయిన, కర్మ =కర్మను, పరిత్యజన్ = విడుచువాడై, యత్ర = ఎచ్చట, అంతరమ్ = అంతర్గతమయిన, కర్మ = ఉచ్చారణ ప్రయత్న రూపమయిన ప్రయత్నమును, కురుతే = చేయునో, సః = అది, ఆరంభః = ఆరంభమని, ఉచ్యతే = చెప్పబడును.

**తాత్పర్యం :–** మనోవాక్కాయజములయిన బాహ్యకార్యములను వదలి అంతర్గతంగా ఏర్పడే నాదాంకురావస్థ ఆరంభావస్థ.

---

**వాయుః పశ్చిమతో వేధం కుర్వన్నాపూర్య సుస్థిరమ్।**

**యత్ర తిష్ఠతి సా ప్రోక్తా ఘటాఖ్యా భూమికా బుధైః॥ 229**

**ప్రతిపదార్థం :–** వాయుః = వాయువు, పశ్చిమతః = పడమరగా, వేధమ్ = వేధను, కుర్వన్ = చేయుచు, ఆపూర్య = సుషుమ్నునునింపి, సుస్థిరమ్ = స్థిరముగా, యత్ర = ఎచ్చట, తిష్ఠతి = ఉండునో, సా = ఆ, భూమికా = దశ, బుధైః = జ్ఞానులచేత, ఘటాఖ్యా = ఘటదశ అని, ప్రోక్తా = చెప్పబడినది.

**తాత్పర్యం :–** పశ్చిమమునుండి అనగా మూలాధారమునందు రంధ్రమునుండి వాయువు సుషుమ్నలోకి చేరి కుంభకంలో స్థిరంగా ఉండిన దశ ఘటావస్థ. అచ్చట నాదం చిణిచిణి శబ్దములతో వినబడును.

---

**న సజీవో న నిర్జీవః కాయే తిష్ఠతి నిశ్చలమ్।**

**యత్ర వాయుః స్థిరః ఖే స్యాత్ సేయం ప్రచయభూమికా॥ 230**

**ప్రతిపదార్థం :–** సజీవః = సజీవుడు, న = కాడు. నిర్జీవః = నిర్జీవుడు, న = కాడు, కాయే = శరీరమునందు, నిశ్చలమ్ = అచంచలముగా, తిష్ఠతి = ఉండును. యత్ర = ఎచ్చట, వాయుః = వాయువు, ఖే = ఆకాశమున, స్థిరః = స్థిరముగా, స్యాత్ = ఉండునో. సేయం = అది, ప్రచయభూమికా = పరిచయదశ.

**తాత్పర్యం :–** వాయువు నిశ్చలంగా ఉంటుంది. శరీరం సజీవమో నిర్జీవమో తెలియని దశ. మహాశూన్యమయిన భ్రూమధ్యాకాశంలో వాయువు స్థిరంగా ఉండే దశ. దీనిలో మద్దెల ధ్వనులు వినవచ్చును.



**యత్రాత్మనా సృష్టిలయౌ జీవన్ముక్తిదశాం గతః।**

**సహజః కురుతే యోగం సేయం నిష్పత్తిభూమికా॥ 231**

**ప్రతిపదార్థం :–** యత్ర = ఎచ్చట, జీవన్ముక్తిదశామ్ = జీవబ్రహ్మైక్యజ్ఞానదశను, గతః = పొందినవాడై, ఆత్మనా = స్వరూపముతో, సృష్టిలయౌ = సృష్టిలయములను, చూచుచు, సహజః = సహజస్థితిగలవాడై, యోగమ్ = సహజయోగమును, కురుతే = చేయునో, సేయమ్ = ఇది, నిష్పత్తిభూమికా = నిష్పత్తిదశ

**తాత్పర్యం :–** దీనిలో నాదరూప జీవుడు పరబ్రహ్మైక్యదశను పొందుతాడు. అది సహజస్థితి. సహజయోగము. యోగి జీవన్ముక్తుడవుతాడు. జాగరణాది ప్రపంచ సృష్టిలయమును సాక్షిగా చూడగలుగుతాడు. కనుక ఇది నిష్పత్తి.

---

**ఏతదుపనిషదం యోఽధీతే సోఽగ్నిపూతో భవతి।**

**స వాయుపూతో భవతి సురాపానాత్ పూతో భవతి॥**

**స్వర్ణస్తేయాత్ పూతో భవతి స జీవన్ముక్తో భవతి। 232**

**తాత్పర్యం :–** ఈ ఉపనిషత్తును చదివినవాడు అగ్ని శుద్ధుడగును. వాయుశుద్ధుడగును. సురాపాన దోషమునుండి విముక్తుడగును. సువర్ణ చౌర్యమను మహాపాతకము నుండి విముక్తుడగును. వాడు జీవన్ముక్తుడగును.

---

**తదేతదృచాభ్యుక్తమ్। తద్విష్ణోః పరమం పదమ్।**

**సదా పశ్యంతి సూరయః। దివీవ చక్షురాతతమ్॥**

**తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే।**

**విష్ణోర్యత్పరమం పదమ్ ఇతి॥ ఉపనిషత్ (వరాహోపనిషత్) 233**

**ప్రతిపదార్థం :–** తదేతత్ = ఆయీ విషయము, ఋచా = ఋక్కుచేత, అభ్యుక్తమ్ = చెప్పబడినది, తత్ = అది, విష్ణోః = విష్ణువు యొక్క, పరమమ్ = శ్రేష్ఠమయిన, పదమ్ = స్థానము, సూరయః = పండితులు, సదా = నిత్యము, పశ్యంతి = చూచుచుందురు, దివి = ద్యులోకమునందు, చక్షురివ = కన్నువలె, ఆతతమ్ = తెరవబడినది, విష్ణోః = విషువు యొక్క, పరమమ్ = శ్రేష్ఠమయిన, పదమ్ =

స్థానము, యత్ = ఏదిగలదో, తత్ = దానిని, జాగృవాంసః = జాగరణం గల, విపన్యవః = శోకరహితులయిన, విప్రాః = విప్రులు, సమింధతే = వెలిగించు చున్నారు.

**తాత్పర్యం:-** ఈ విషయము ఋక్కుచేత చెప్పబడినది. అది విష్ణువు యొక్క పరమస్థానము. పండితులు దానిని సదా గమనించెదరు. అది ద్యులోకమున కన్నువలె తెఅచికొనియున్నది. దానిని జాగరణశీలులు, మన్యురహితులు అయిన విప్రులు విష్ణ పదమని అగ్గించెదరు.

---

**మేళ్లచెర్వు వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి**

**విరచితమయిన "రసా" వ్యాఖ్య**

**సమాప్తము**

**శ్రీః**





Sri Chakra Space Frame (3D)